# ఉత్తర రాఘవము

## (కుశ-లవ)

తొమ్మిగి అంకముల నాటకము.

ఇది

బలిజేపల్లి లక్ష్మీకాంత కవిచే

రచింపఁబడి

ప్రకటింపఁబడినది.





[రు 1-4-0

# ఉత్తరరాఘవము

## (కుశ-లవ)

తొమ్మిది అంకముల నాటకము.



మహాకవి భవభూతి సంస్కృత "ఉత్తరరామచరిత"

ననుసరించి

గాలిజేపల్లి లక్ష్మీకాంతకవిచే

ఆంధ్రమున రచింపఁబడి

ప్రకటింపఁబడినది.

రెండవకూర్పు 2000 ప్రతులు.

రజత ముద్రాక్షరశాల, తెనాలి.

**1924**



[రు. 1—4—0.

# ఈ నాటకమునందలి పాత్రలు.

—:పురుషులు:—

శ్రీరాముఁడు
లక్ష్మణుఁడు
భరతుఁడు
కంచుకి
అష్టావక్రుఁడు
సూతుఁడు
ప్రతీహారి
దుర్ముఖుఁడు
వాల్మీకి
,, ఇద్దఱు శిష్యులు
విప్రుఁడు



జనార్దనభట్టు
నారాయణభట్టు
శంబుకుఁడు
దివ్యపురుషుఁడు
కుశుఁడు
లవుఁడు
వటువులు
జనకుఁడు
చంద్రకేతుఁడు
సూత్రధారుఁడు

—:స్త్రీలు:—

సీత
విప్రునిభార్య
అనసూయ
మురళ
వాసంతి

అరుంధతి
కౌసల్య
పృథ్వి
భాగీరథి

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః

# విజ్ఞప్తి.

సహృదయులారా! చిరకాలముక్రిందటనే ఉత్తరరామకథను స్వతంత్రనాటకముగా వ్రాసితిని; కాని భవభూతిమహాకవి యుత్తరరామచరితమందలి యద్భుతకథాసంవిధానముంగూర్చి చర్చించుకొను కొలంది నానాటకమును బ్రకటింపవలయునను నుత్సాహమే లేకుండెను. ఈవరుత్సాహముతో నూరకుండక యామహాకవి నాటకమును దెనిఁగింప మొదలిడి చాలవరకు ముగించితిని. అవకాశమొదవిన ట్లక్కడక్కడ ననేకుల కనేకపర్యాయములు తెనిఁగించినభాగములను స్వతంత్రించివ్రాసిన భాగములను గూడ వినిపించితిని. ముద్రణమునకుఁబూర్వమే వీనిలోని కొన్నిపద్యముల నెందఱో కంఠపాఠముచేసి చదువుచుండిరి. విడివిడిగా నీరెండుభాగములు రెండుసంపుటములుగాఁ బ్రకటింపుమని కొందఱును, కొంతప్రయత్నముతో స్టేజిపై ప్రదర్శించుట కనుకూలముగా నీరెండు సంపుటములలోని భాగములను గథాసంవిధానమునం బౌచితిని బాటించి యనుసంధించి యొకసంపుటముగానే ముద్రింపుమని కొందఱును నాకు సలహానిచ్చిరి. ఈ రెండవపద్ధతి కొన్నికారణములచే నాకునచ్చెను. ఏమన, ఒకకథయే రెండుగ్రంథములుగా ముద్రించుట ధనవ్యయమగుననియు, ధనవ్యయమున కొప్పుకొన్నను నిదివర కుండిన మహామహుల కేవలాంధ్రీకరణములయుండఁ బాఠకులకైనను నాయది యెమంత గాణించుననియు, నిజమైన నాటకసారస్వత కళాప్రదర్శనమునందు సమర్థులయ్యుఁ బామరరంజనమునకై యేపార్సీమట్లతోడనో విదేశీయ విజాతీయ రుచులతో బయస్కోపు ప్రదర్శనముల ననుకరించి కాలక్షేపముచేయు నిప్పటినాటకపు కంపెనీలవారీవఱకుండిన యుత్తమోత్తమములగు నాంధ్రీకృతోత్తరరామచరితముల నాడుటకే వెనుదీయుచున్నప్పుడు నాయాంధ్రీకరణమును మాత్రము ప్రదర్శింప సాహసింతురాయనియు, నంతపోడిమ యాకంపెనీలకుఁ గలిగినప్పుడున్న, యాంధ్రీకరణములే చాలుననియు నూహించుకొని భవభూతి యనుసరణమును నాస్వతంత్రరచనయు జోడించి యొకసంపుటముగానే ముద్రించితిని. ఇదియైనను పార్సీమట్లవారివంతగా నక్కఱకురాదుగాని నాటకసారస్వతకళాసౌధము నారోహింపఁ బ్రయత్నించువారికి మొదటిమెట్టుగానైన నుపయోగించునని నానమ్మకము. ఇట్లుజోడించుటలో భవభూతికథ యించుకంత మార్పునలసివచ్చినది. లక్ష్మణుఁడు సీతను వాల్మీకాశ్రమప్రాంతమున విడిచిపోయిన కథను భవభూతి ప్రత్యక్షముగాఁ జూపక, తనద్వితీయాంక ప్రారంభముననే యొకవిష్కంభ

ములో నాత్రేయి వాసంతికచేఁ జెప్పించినాఁడు. అందుసీత ప్రసవవేదన కోపఁజాలక గంగలో దుమికినట్లును, అందు కుశలవులఁ గనినట్లును పృధ్వీభాగీరథులామెను బోషించినట్లును వారిపాలువిడిచిన పిల్లలను వాల్మీకికి నొప్పగించినట్లును జెప్పించినాఁడు. సీతమహాత్మ్యమును బ్రకటించుటకై ఆమెను లోకాంతరావాసమును, అందు లౌకిక దేవతాపోషణమును గల్పించి, సీతారామ పునస్సంయోగమునరసుఁగూడఁ గుశలవులకైనను సీత తమతల్లియని తెలియకుండనుంచి యద్భుతరసమును బ్రదర్శించినాఁడు. సీతను లక్ష్మణుఁడు వాల్మీకాశ్రమమున డించుకథ ప్రదర్శనమునకు యోగ్యముగనుండునని నేనుప్రత్యక్షముగ రెండవయంకమునఁ జూపించినను భవభూతి పరమోద్దేశములకు భంగము రానీయలేదని చదువరులు పరికింతురుగాక. భవభూతిమహాకవి హృదయమును వెల్లడించుటలో నానంటివాని కేలోపములు లేకుండుట యొకగుణమే కాని యుండుట యంతలోపముకాదు. నాగ్రంథమునఁ బొరపాటున నేని రసమెందేని బొసంగినచో నానందింతురుగాక !

నాటకసామాజికులు వారివారి వీలుననుసరించి 1,2,3,6,7,8,9, అంకములఁగాని 1,2,5,6,7,8,9, అంకములఁగాని ప్రదర్శించుకొనవచ్చును.

## రెండవకూర్పు.

నా యీగ్రంథము కొలఁదిమాసములకే రెండవతూరి ముద్రించుట కవకాశ మొసంగినందులకు నాంధ్రపాఠక మహాశయులకు నాకృతజ్ఞతాభినందనము లర్పించుచున్నాఁడను. ఈకూర్పునందు మార్పులక్కడక్కడ నవసరముగా జూపట్టినను నాకవకాశము లభింపమి యట్లేముద్రించితి.

నాటకసామాజికులు సుళువుగా నెట్లుప్రదర్శించుకొనఁదగునో మొదటికూర్పు పీఠికలో వ్రాసితిని. ఆవిధముగ బ్రదర్శించిన నాటకము అయిదుగంటల కాలము కంటె నెక్కుడుపట్టదు. శ్రద్ధతోఁ చదివి నిపుణముగాఁ బ్రయోగింప గలిగినచో నాటకమంతయు ప్రేక్షకులహృదయ మాకర్షింపఁగలుగునని నమ్మకము.

ఇట్లు,

గుంటూరు,
1-6-24.

విద్వజ్జన విధేయుఁడు,
బలిజేపల్లి లక్ష్మీకాంతం.

# — ప్రస్తావన. —

గీ॥ ఆదిమకవీంద్రులకు నభివాదనంబు
విమలభక్తి నిదే సమర్పించుకొందు;
అమృతయును, శాంతకలయునై యలరు వాణి
నిత్యకల్యాణి మాకు రాణించుకొఱకు॥

(నాంద్యంతమున సూత్రధారుఁడు.)

అతివిస్తరమేల? ఆర్యమిశ్రులారా! వినియుందురుకదా, మహానుభావుని, కాశ్యపుని, శ్రీకంఠపదలాంఛనుని, పదవాక్యప్రమాణతత్త్వజ్ఞుని జాతూకర్ణీపుత్రుని భవభూతియను మహాకవిని; వశీకృతవాణి యగు తత్కవిబ్రహ్మచే గీర్వాణభాషలో రచియింపఁబడి, విదర్భదేశములోని పద్మనగరమునందుఁ గాళప్రియనాథుని యుత్సవసమయమునఁ బ్రదర్శింపఁబడి విశ్వవిఖ్యాతిం బడసిన యా "ఉత్తరరామచరిత" నాటకమును" గొలఁది మార్పులతో నాంధ్రమున నేఁడు మీ యెదుటఁ బ్రదర్శింప నెంచితిమి, కావున సావధానమున నవధరింతురుగాక !

కార్యవశమున నే నిప్పుడయోధ్యాపురవాసినయి రామ సమకాలికుఁడ నైతిని (అంతటఁ గలయఁజూచి) ఓహో! ఏమిది పౌలస్త్యకులధూమకేతువగు శ్రీరామసార్వభౌముని పట్టాభిషేకసమయము కదా! రాత్రిందివము లవిచ్ఛిన్నముగ మహానందనాందీవాదములతో సందడించు నీ చత్వరస్థానంబు లేలకో చారణవ్యాపారములు లేక మాటుమణఁగి యున్నవి.

నటుఁడు—(ప్రవేశించి) భావా! ఎఱుంగవా యేమి? ఈయుత్సవములెల్ల నెవరి నారాధించుటకై యిన్నిదినములు జరిగెనో యట్టి లంకాసంగ్రామమిత్రులగు వానర, రాక్షసులను, నానాదిగంతాగతులగు పూజ్యులగు బ్రహ్మర్షి రాజర్షి సత్తములను, నెవరియిండ్లకు వారిని మహారాజుగారు పంపివేసినారుకదా; మఱియు నిప్పుడు,

గీ॥ అల్లునిమఖంబుగనఁదనియార్యఋశ్యశృంగునాకరిగిరవసిష్ఠులల్లులందఱునరుంధ
తీసతీమణి వెనువెంట, దశరథేంద్రుఁ డలవశిష్ఠుఁ డధిష్ఠాతయై మెలంగ॥

సూత్ర—భావా, విదేశీయుఁడఁగాన నడుగుచున్నాను. అల్లుఁ డెవ్వరు ?

నటు.— గీ॥ దశరథున కుద్భవించె శాంత యనుకన్య
గోమపాదుండు పుద్ధార నామె౯ బెనిచె
ధర్మపత్నిగ నల విభాండకసుతుండు
ఋశ్యశృంగుండు గాని౯ బరిగ్రహించె॥

ఆయల్లుఁడే యిప్పుడు ద్వాదశవార్షిక యజ్ఞమును బ్రారంభించి నాఁడు. పూర్ణగర్భిణియగుటచే౯ గోడలిని సీత నింటనే విడిచి తప్పని విధిగా౯ బెద్దలందఱు యాగమునకేగిరి.

సూత్రి.—ఆగోడవయంతయు మనకేల ? పద. రాజద్వారము నాశ్రయించి మన కులధర్మము ననుసరింతము.

నటు.—అలాగైన మహారాజుకొఱకు౯ బరిశుద్ధమైన స్తోత్రపద్ధతి నేదేని నిర్ణయింపుము.

సూత్ర.--మారిషా !

గీ॥ ఎల్లవిధముల నుతియింపు మేల శంక ?
తప్పు లెన్నుట మొల్లను దప్పదింక;
యువతులం దెట్లో యట్లె కవితలందు
సాధుతానిర్ణయమున దుర్జనులు జనులు॥

నటు.--కడుంగడు దుర్జను లనుము.

గీ॥ జానకీదేవి౯ గూర్చియే జనులు లేనిపోని యపనిందలను దలమోపినారు
హేతువింతకు రక్కసునింట నుంట,వహ్ని పరిశుద్ధిమాట యబద్ధమంట

సూత్రి.--ఈలాటికింవదంతి మహారాజు చెవి సోకెనేని కొంపమునుఁగునే!

నటు.--కాని సర్వథా వేల్పులును ఋషులును శ్రేయమాపాదింతురు గాక ! (పరిక్రమించి) మహారాజుగారిప్పు డేమనున్నారో ? (విని) ఇట్లనుకొనుచున్నారు.

మ॥ అనుఁగుంగూఁతును నల్లునిం గన విశేషాధీనుఁడై తెంచి, మ
న్నన నిన్నాళ్ళు మహోత్సవంబుల మహానందంబునన్ దీర్చి క్ర
న్నన నేఁడే తనయింటికేగెను వసంతంబొన్న సీతం బ్రియం
బునఁదేర్పం బ్రభువేగ నా సభవసంతంబుం గొల్వుఁ జాలించుచున్॥

(ఇరువురు నిష్క్రమింతురు.)

—♦ ఇది ప్రస్తావన. ♦—



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# ఉత్తర రాఘవము.

## ప్రథమాంకము.

(శ్రీరాముఁడును సీతయు నుపవిష్టులై యుందురు.)

రాము—దేవీ! వైదేహీ! ఊరడుము. మనపైఁ బ్రేమలేకయా మీ తండ్రిగారు వెడలిపోయినది? నిత్యకర్మానుష్ఠాన తత్పరులయిన వారికి, స్వేచ్ఛావర్తనము సాగివచ్చునా? ఆహితాగ్నుల గృహస్థ ధర్మ మాచారభంగ సందేహములతో ననుక్షణము సంకట మైనదని యెఱుంగవు?

సీత—ఎఱుంగుదును; అయినను బంధుజనవియోగములు మనస్సుల వ్యాకులపెట్టక మానవుకదా.

రాము—ప్రియసీ; ఇవియే సంసారములోని భావములు హృదయముల విదారించునవి. వీని నేవగించియే జ్ఞానులరణ్యముల విశ్రమింతురు.

కంచుకి—(ప్రవేశించి) రామభద్రా! (అని శంకించి) మహారాజా!

రాము—ఆర్యా! తండ్రిగారి పరిజనము నన్ను "రామభద్రా" అని పిలుచుటయే నాకు ముచ్చట, అలవాటు తప్పింపకుము.

కంచుకి—ఋష్యశృంగాశ్రమమునుండి అష్టావక్రులు దయచేసినారు.

సీత—అభ్యంతరమేమి!

రాము—వెంటనే ప్రవేశపెట్టుము.

అష్టా—(ప్రవేశించి) మీకు శుభమగుఁగాక !

రాము—అభివందనము. ఇటు దయచేయుఁడు.

సీత—వందనము. కుశలమేకదా పెద్దలందఱికిని మావదినె శాంతమ్మకును?

రాము—నిర్విఘ్నముగ సాగుచున్నదా యజ్ఞము ?

సీత—అయ్యో ! వారుమమ్ముఁ దలంచుచుందురా ?

అష్టా—దేవీ! భగవంతుఁడు వసిష్ఠుఁడిట్లు నిన్నుఁగూర్చి చెప్పుమనియె.

సీ॥ వివిధపరిజారాధ్య • విశ్వంభరాదేవి కడుపారఁగా నిన్నుఁ • గన్నతల్లి
అపరప్రజానాథుఁ • డని జగన్నుతిగన్న జనకరాజర్షి నీ • యనుఁగుఁదండ్రి
భువనబాంధవుఁడు మే • మును వంశగురులమౌ నలరాచవారి కో • డలవు నీవు
మనుకులాలంకార • మునకు రామునకు, గుణాభిరామునకు వ • ధూంగివీవు
గీ॥ అమ్మరో! యింతకంటె సం • పాదిశ్వ మైన। శ్రేయమెయ్యది గుణలమా • శీర్వదింప
రాఘువధురంధరుల కుపు • త్రికులఁ గాంచి। వీరమాతృవుతల్లివై • వెలయుము తల్లి!॥

రాము—దేవ ! అనుగ్రహింపఁబడితిమి.

అష్టా—రామభద్రా! భగవతి యరుంధతియు శాంతయు పదే పదే నీకుఁ జెప్పుమనిన సందేశమిది. "వేవిళ్లగుటచే జానకి యేమేమి యభిలషించుచుండునో వానిని వెంటనే నెఱవేర్చుచుండుము" అని.

రాము—అలాగుననే ; కోరినదే తడవుగా.

అష్టా—వత్సా! జానకీ! నీయాఁడుబిడ్డయు ఋష్యశృంగులును నీకుఁ బలుమాఱుఁ జెప్పిన దిది. "అమ్మాయీ! నీవోపలేనిదానవగుటచే యజ్ఞమునకు నిన్నుఁ దోడ్కొని రాకుంటిమి. అబ్బాయిని రామభద్రుని నీవినోదముకొఱకే నీయొద్దవిడిచివచ్చితిమి. పుత్రపూర్ణోత్సంగవగు నాయుష్మతిని నిన్నుఁజూచి యానందింపఁగలము." అని

రాము— (చిఱునగవుతో) తథాస్తు. వసిష్ఠభగవానులు నాకేమైన సందేశ మనుగ్రహించిరా?

అష్టా—ఇదిగో వినుము.

గీ॥ అల్లునిమఖంబు, తీరమి • యయ్యొ మాకు
బాలుఁడవు, నీకుఁ గ్రొత్త భూ • పాలనంబు
జనుల రంజించి కాంచు య • శంబె ధనము
కంటెఁ బ్రాణంబుకంటె యో • గ్యంబుమీకు ॥

రాము — భాగ్యము.

గీ॥ దేశజనరంజనక్రియా • దీక్షయందు
స్నేహమునుగాని, దయగాని • స్వీయమైన
సౌఖ్యమునుగాని కడకు నీ • జనకసుతను
గాని విడనాడుచో వెను • కాడఁబోను ॥

సీత — ఆహా! కావుననే యార్యపుత్రులు రఘువంశధురంధరులు.

రాము — ఎవరక్కడ? అష్టావక్రుని విశ్రమింపఁజేయుఁడు.

అష్టా — (లేచి పరిక్రమించి) ఓహో చిరంజీవి లక్ష్మణుఁడరుదెంచినాఁడు. నేను విశ్రమింపఁబోయెదను. (నిష్క్రమించును)

లక్ష్మ — జయము జయ మార్యునకు. నియమించినప్రకారము మీచరిత్ర మంతయుఁ జిత్రకారుఁ డీపటమునఁ జిత్రించినాఁడు. వినోదింపఁ గోరెదను.

రాము — వత్సా! మంచి సమయముననే తెచ్చితివి. దేవిని వినోదింపఁ జేయువిధానమెఱుంగుదువు. కథయెంతవరకుఁ జిత్రింపఁబడినది

లక్ష్మ — ఆర్యురాలి అగ్నిపరిశుద్ధివరకును

రాము — హా! పాపము శాంతించుఁగాక,

గీ॥ పుట్టువునుబట్టియే పరి • పూతమైన
యీమహీజకు శుద్ధి వే • ఱేమికలదు
అన్యములచేత శుద్ధిక • ర్హంబులగునె
ధన్యతీర్థోకముగాని, • వహ్నిగాని ॥

దేవీ! దేవయజనసంభవా! క్షమింపుము. ఈజనప్రవాదము నీకు యావజ్జీవితమైనది.

చం॥ పరమకుల ప్రతిష్ఠ నిలు ♦ పం దలఁపూనినతేనికి న్నిరం
తరము ప్రజానురంజనప ♦ థం బనుగమ్యము గాన, నీయెడన్
నెఱపితి నాఁ డవాచ్యమగు ♦ నిర్ణయ; మాఁదలఁదాల్పనొ మనో
హర సురభిప్రసూన, మగు ♦ నా చరణాహతుల న్నలంపఁగన్? ॥

సీత—ఆర్యపుత్రా! మఱచిపొం డావిషయమును. రండు, పవిత్రమైన మీచరిత్రము చూతము.

లక్ష్మ—(చిత్రపటము విప్పి) ఇదియే యాచిత్రపటము.

సీత—(నిర్వర్ణించి) వీరెవ్వరు! ఆకసమునఁ గ్రిక్కిఱిసినట్లు నిలువంబడి యార్యపుత్రుని స్తుతించుచున్నట్లున్నారు.

లక్ష్మ—ఇవియే సరహస్యములగు జృంభకాస్త్రములు. తాటకాసంహార సమయమున భగవానుఁడు విశ్వామిత్రుఁ డన్నగారికిఁ బ్రసాదించిన యాయస్త్రరాజము లివియే.

రాము—దేవీ! నమస్కరింపు మీ యస్త్రరాజములకు. బ్రహ్మాదులగు మహానుభావులు వేనవేలువత్సరములు తపంబొనరించి, లోకహితార్థమై వీనిని సృష్టించిరి.

సీత—నమస్కారము దివ్యాస్త్రములారా!

రాము—దేవీ! ఈ యస్త్రములు సర్వథా నీ సంతానము నాశ్రయించుఁగాక.

సీత—కృతార్థురాలను.

లక్ష్మ—చూడుఁడిది మిథిలావృత్తాంతము.

సీత—ఓహో! ఎంత మనోహరము! ఇదిగో యార్యపుత్రుని సౌందర్యమూర్తి! అప్పుడే వికసించుచున్న నల్లగల్వతేకుం బోలిన శ్యామనచ్ఛాయతో నున్ననై, చిక్కనై, బలిష్ఠమైయున్న యీ

శరీరసౌభాగ్యమును తెప్పవేయక మానాయనగారు తిచ్చవడి చూచుచున్నారు. ఆహా! అల్లారుముద్దారు పిల్లజులుపములతో నందగించు వదనారవిందమునం దామందహాసమేమి! అవలీలగా హరచాపమందికొని యెక్కిడుచున్నారు!

లక్ష్మ—

గీ॥ వీరె మాతండ్రిగారు గా ♦ వించుచుండి
రనుఁగు వియ్యంకులకు వసి ♦ ష్ఠాదిములకుఁ
దత్తదుచితప్రకార స ♦ త్కారవిధులఁ
దన పురోహితుఁడైన గౌ ♦ తముని గూడి॥

రాము—ఆహా! నేత్రోత్సవకరమైన దీవిషయము.

గీ॥ రఘుజనకవంశములకు నే ♦ ర్పడిన యిట్టి
యందమగు వియ్యమెవని కా ♦ నందమిడదు;
దాతయుఁ బరిగ్రహీతయుం ♦ దానె యగుచు
మనువు స్వాయముగఁ గుశికనం ♦ దనుఁడు నడుప॥

సీత—ఆహా! వీరె పెండ్లికొడుకులు మానల్గు రన్నదమ్ములు- కలకల లాడుచున్నవి పెండ్లికళలు- ఆహా! యాప్రదేశమందే, యా సమయమందే యిప్పుడున్నానా యేమి!

రాము—నేనును నట్లే యనుకొనుచున్నాను.

మ॥ అనురక్తిం బులకించి, క్రొంజెమరువా ♦ ర్యఙ్, గంకణశ్రేణి ఘ
ల్లనఁ గంపించుచునున్న నీతలిరుఁగే ♦ లాగౌతముం దూది, రఘు
ల్లని నాపై పులకింప, నాకరమునం ♦ దర్పించు నానాఁటిమో
హనదివ్యోత్సవ మిప్పుడుఙ జరుగుచు ♦ న్నట్లే మనంబూఁగెడుఙ॥

లక్ష్మ—ఈమె పెద్దవదినెగారు. ఈయమ చిన్నవదినె, మాండవి. ఇది మఱదలు శ్రుతకీర్తియును.

సీత—(చిఱునవ్వుతో) వత్సా! ఇది యెవ్వరు, ఇంకొకతె?

లక్ష్మ—(తనలో) వదినెగా రూర్మిళ నడుగుచున్నారు కాని దృష్టి మఱి యొకచోటికి మరల్చెద. (ప్రకాశముగా) ఆర్యురాలా! చూడుఁ డీయన పరశురాముఁడు. అన్నగారు హరకోదండము ఖండించిన వార్త విని ... ...

సీత—అమ్మయ్యో! భయమగుచున్నది.

రాము—ఋషిసత్తమా! నమస్కారము.

లక్ష్మ—కడ కీయన మాయన్నగారిచే ... ...

రాము—(సాక్షేపముగా) సౌమిత్రీ! ఇంతకంటె వినోదింపఁదగిన విషయము లేదా చిత్రపటమున?

సీత—(సబహుమానముగాఁజూచి) ఇటువంటి వినయప్రభావముచేతనే యార్యపుత్రులు, మఱింత శోభిల్లుచున్నారు.

లక్ష్మ—ఇదిగో మన మయోధ్యం జేరితిమి.

రాము—వత్సా! సౌమిత్రీ!

గీ॥ తండ్రిగారుండఁగా, మన ♦ తల్లులెల్లఁ
గ్రొత్తగాఁ బెండ్లియైన న ♦ ల్గురఁ గోడాండ్ర
ముద్దుముచ్చటలంగని ♦ మురియుచుండు
మంచిదివసంబు లవి యంత ♦ రించెనె కద॥

లక్ష్మ—ఇంక మంచిదివసంబు లెక్కడివి? ఇదిగో మంథర.

రాము—(వేఱొకచోఁ దిలకించి) చూడుము వైదేహీ!

గీ॥ శృంగిబేరపురంబు సే ♦ రంగఁగనిన
యింగుదీపాదపం బిది ♦ యేణలతాంగి!
దీనినీడనె పల్లెమ ♦ న్నినిఁ గోడ
మనకు లభియించె మిత్రస ♦ మాగమంబు॥

సీత—ఇది జటాబంధన వృత్తాంతము కదా!

లక్ష్మ—అవును. ఆకాలమహిమ యెట్టిదో కాని,

గీ॥ ముదిసి ముప్పున రాజ్యసం ♦ పదల సుతుల
పరముగావించి, యిక్ష్వాకు ♦ ధరణిపతులు
నైకొనెడు పుణ్య మారణ్య ♦ కవ్రతంబు
చేకొనఁగదమ్మ మాయన్న ♦ చిన్ననాఁడె॥

సీత—ఇదికదా, ప్రసన్న పుణ్యసలిలయగు భగవతి భాగీరథి.

రాము—తల్లీ! రఘుకుల దేవతా! నమస్కారము.

లక్ష్మ—ఇక్కడనుండి భారద్వాజాశ్రమము మీఁదుగ మనము దక్షిణారణ్యము ప్రవేశించితిమి.

సీత—ఇదిగో మనదక్షిణారణ్యయాత్ర; జరిగినది జరిగినట్లుగానే చిత్రింపఁబడినది. నా కెండపొడ సోకకుండుటకై, యార్యపుత్రులు నాతలపై నొక తాలవృంత మాతపత్రముగఁబట్టి నన్ను మెల్లన నడిపించుచున్నారు.

లక్ష్మ—అమ్మా! ఈప్రాంతముననే ప్రశాంతములైన తపోవనభూములు. చూడుఁడు, సెలయేళ్ల తీరములందలి తరుమూలముల నాశ్రయించి తపంబొనరించు వానప్రస్థుల చేతను, శమదమాన్వితులై నిరంతరాతిథేయవ్రతనిష్ఠాగరిష్ఠులై, నీవారముష్టింపచులై, స్వచ్ఛందజీవయాత్రం గడుపుకొను గృహస్థుల పర్ణశాలికల చేతను నీప్రాంతమంతయుఁ బ్రశాంతమనోహరముగ నున్నది.

రాము—ఆహా! ఇది చూచునప్పుడాయాశ్రమవృత్తాంతములే నాకుఁ గన్నులఁ గట్టినట్లున్నవి.

సీ॥ కలసి నివ్వరిధాన్య ♦ ములు దంచు జడదారిపడఁతుల మేటిసు ♦ వ్వాలపాట
చిలుకలుం గోరవం ♦ కలు, పెద్ద శేతేర "అస్యతా" మను స్వాగ ♦ తానువాద
మేకాలునక బీలు వోక ♦ పూనిఫలించు స్వచ్ఛందతయులతా ♦ సంచయంబు
బ్రహ్మవిద్యార్థతా ♦ త్సర్యచర్యాధీన పరమర్షి గంభీర ♦ భావ గరిమ

గీ॥ తొలచివ్వంతాపసమునుండి ♦ మలయుచుండు వలపుఁజల్లనిగాడ్పుల ♦ వైభవంబు
తలఁచికొనినంత మేనెల్లఁ బులకరించు సౌఖ్యములకెల్ల మునుల యా ♦ శ్రమములెల్ల॥

సీత—ఆహా! ఈ ప్రదేశం బెంతతడవు చూచినను దనివిదీరకున్నది కదా!

లక్ష్మ—ఇక్కడఁదిలకింపుఁడు. దండకారణ్యమధ్యస్థమగు ప్రస్రవణ పర్వత మిది. నిరంతరము వర్షించుచుండు నీరంధ్రమేఘసంఘాత ముల సంయోగముచే సాంద్రీకృతశ్యామలవర్ణములై దీని శిఖ రాగ్రములు విరాజిల్లుచుండు; దట్టముగఁ బెనవైచికొని, పుంజీభ వించియున్న తరులతానికుంజములచే, నిరంతరస్నిగ్ధశీతలశ్యామ లంబగు నీ కాంతార పర్యంతభాగములలో గోదావరీస్రవంతి ప్రవ హించుచున్నది. ప్రపాతసంవేగమువలనఁ బరస్పరాస్ఫాల్యమాన ములగు, నేతత్తరంగిణీసముత్తుంగతరంగసంఘముల రొదలతో నీపర్వతకందరము లెడతెఱపిలేక ప్రతిధ్వనించుచుండును.

రాము—నెచ్చెలీ! ఈ ప్రాంతమునఁ గొంతకాలము నివసించి, మన మెంతయుల్లాసముగఁ గాలము గడిపితిమో స్మరణకు వచ్చుచు న్నదా? ఈ నీమఱందికుట్ట నానావిధరుచ్యఫలాహారంబుల సేక రించికొనివచ్చి మనల సేవించుచుండెడివాఁడు. మంజులతాంత లతానికుంజములతో మనోరంజకములగుగోదావరీనదీకూలములు మనవిహారముల కనుకూలము లగుచుండెడివి. (రహస్యముగా) చూడు, ప్రేయసీ జ్ఞప్తియున్నదా!

మ॥ అలలందోఁగుచుఁ బిల్లగాడ్పు లలస ♦ వ్యాలోలతఁ వీవ, మే
ల్వాలిపెంపుం దెలికప్పురంపుఁ బెను ది ♦ వ్వంబోలు గోదావరీ
పులినంబం దొకనాఁటిరేయి సరసం ♦ పుఁ వెన్నెలఁ రాగముల్
వాలయం గాంచిన నాఁటిసౌఖ్యము తలం♦పుంబాయ దెన్నాళ్లకుఁ॥

సీత—మనోరమణా! అరణ్యమందున్నను మనము సౌఖ్యముగనే కాల ము గడిపితిమి, రాజధానియందింత నిరాకులమగు సౌఖ్యమెక్క డిది? చూడుఁడు,

సీ॥ దొరకునా! యిచ్చటి ♦ దోరఁబండిన రేఁగుపండ్ల చేసంబు, నీ ♦ వారభుక్తి
కలుగునా! చేతిమేఁ ♦ తలఁ బెంచి మంచిన వనకురంగీ స్నేహ ♦ వైభవంబు
చేకూడునా! తప ♦ స్వినులాదరముతోడ సారెఁ బెట్టిన మేలి ♦ నారచీర
మరల లభించునా! ♦ మనకు గోదావరీ పులినహంసాంగనా ♦ విలసనములు

గీ॥ బుజముల నలంతి బిందెలం ♦ బూని, పాఱుత్రావుఁ బైఁటలు దడియ, ముద్దాడు నడలఁ
దబిసికన్నెలు పాదులం ♦ దడుపునట్టి మధురనిగమార్థగీతిక ♦ లినఁగలవె? ॥

లక్ష్మ—అమ్మా! ఇది పంచవటి. ఇదిగో శూర్పణఖ.

సీత—అయ్యో! ఆర్యపుత్రా! ఇంతవరకేకదా మిమ్ముఁ గలిసియుండు భాగ్యము నాకు.

రాము—ఓసి వియోగభీరూ! ఇది చిత్రపటము, భ్రమఁ జెందకుము

సీత—ఏమైనను దుర్జనుఁడు, దుఃఖమునే కలిగించుఁగదా?

లక్ష్మ—అమ్మా! అం దాశ్చర్య మేమున్నది?

మ॥ మును మాయామృగకైతవంబుల దురా ♦ త్ముల్ రక్కసుల్ మాకొన
ర్చిన ద్రోహంబుఁ బ్రతిక్రియన్ దుడిచినన్ ♦ జేయున్ మనోబాధ నూ
తనమై, యాతటి శూన్యమైతగు జన ♦ స్థానంబునం గుందునా
ర్యుని శోకార్తికి, రాయియేన్ గఱఁగిలీ ♦ రున్ వజ్రమేన్ భిన్నమౌ॥

సీత—హా! రఘుకులానందా! మందభాగ్యనైన నానిమిత్తమై యంతటి సంతాప మనుభవించితిరి గదా!

లక్ష్మ—(కన్నీటఁదోఁగు రామునింగాంచి) ఆర్యా! ఏమిది చిత్రపటదర్శన మాత్రముననే మీరును మనోవైకల్యముఁ జెందుచున్నారు!

రాము—వత్సా! సౌమిత్రీ! ఈవృత్తాంత మట్టిది; యెఱుఁగనివాఁడవు కావుగదా

చం॥ ప్రియజనవిప్రయోగమునఁ ♦ బేర్చిన యప్పటిశోకవహ్ని, త
ద్దయు భరమయ్యు నోర్చితిఁ గ ♦ దా యెటులేన్ బగదీర్పనెంచు ని

శ్చయమున; నేఁ డదే మరల • స్వాంతమునన్ సెలవారి దుస్సహం
బయి పరిపక్వమైన హృద • యవ్రణము ట్లొనరించు వేదనన్ ॥

సీత—అయ్యో! ఏమిసేయుదు. దుర్భరవిరహాభావమున మునింగి నేనిప్పు
డార్యపుత్ర శూన్యురాలనై పోయితినే!

లక్ష్మ—(స్వగతము) ఓహో! వీరిచిత్తవృత్తుల నన్యథా మరలింప
వలయు. (ప్రకాశముగా) అమ్మా! ఇటుఁజూడుము. మన్వంతర
వృద్ధుని జటాయుని పరాక్రమోదంత మిది.

సీత—(చూచి) హా తండ్రి! ఆపన్నురాలి నన్నురక్షించుటకుఁ బ్రాణ
ములఁగూడఁ దృణప్రాయముగ విసర్జించి, నీయపత్యవాత్సల్యము
వెల్లడించితివి కదా,

రాము—నాయనా; కాశ్యపా; తీర్థభూతుఁడగు నీయట్టి మహానుభావుఁడు
మాకు మరల లభించునా?

లక్ష్మ—అమ్మా! యీమెయే "శ్రమణ"యను సిద్ధశబరి.

సీత— తల్లీ శబరీ! ఎంత పుణ్యాత్మురాలవు. నాఁడు నిన్నుఁ జూచు
భాగ్యము లేకపోయినను నేఁడు చూడఁ గల్గితిని.

రాము—దేవీ! ఈశబరిమాటఁ దలంచిన నాహృదయ ముప్పొంగును.
చూడు మెట్లున్నదో! ఆహా ఆవినయము, ఆయాదరణము. ఆభక్తి
ప్రపత్తి, యాయతిథిపూజాతాత్పర్యము, వాచామగోచరములు.
పాపము మాకొఱకై శ్రమపడి యింతవింతయోగిరము లెన్నెన్నో
సంతరించినది. ఎందులకో,

సీ॥ అలరుఁ గన్నీరు చు • క్కలు చాలవనియేమొ పానీయమున నర్ఘ్య • పాద్య మొసఁగె
కన్గూవు లరవిరాద్పు • గనఁ జాలవనియేమొ విరియు సెత్తావి కొ • వ్విరులు వత్తె;
పలుకు గద్గదిక వె • ల్వడఁజాల దనియేమొ తేటిన మంచి పూ • దేనెఁగూర్చె;
పైకి నేర్పడని భా • వము చాలదని యేమొ యుపహారఫలము లె • న్నోయమర్చె

గీ॥ ఎదురువడి,దోయిలించి, "నాయడిననిందు! గౌమమ శ్రీరామ!తరియింతు"ననుచు శబరి
యట్టె పరవశయై, నిల్చి • నట్టె నిలిచె। నారగించితి నపుడు; నో • రూరు నిపుడు॥

లక్ష్మ—ఈతఁడు మహానుభావుఁ డార్యుఁడు హనుమంతుఁడు.

సీత—ఆహా! చిరకాలమునకుఁ గంటిని, చిరనిర్విణ్ణమైన జీవలోకము సముద్ధరించిన యీపరమోపకారిని.

రాము—గీ॥ అంజనానందవర్ధనుం ♦ డైన యితఁడు
బాహుశాలి, శుభకీర్తియౌ ♦ దోఃబలుండు
ఇతని శౌర్యంబునఁ గృతా ♦ ర్థత సుగ్రీవుఁ
గలిగె; మనకును నెల్ల జ ♦ గంబులకును॥

సీత—వత్సా! ఈకొండ పేరేమి, విరియఁబూచిన కడిమిచెట్టుపై మయూర దంపతులు, తాండవించుచున్నవి. శరీరలావణ్యకాంతి, ధూళిధూసరితంబైయున్నను, సహజానుభావసౌందర్యమాత్రమున గుర్తింపఁదగి, ముహూర్తమాత్రము మూర్ఛిల్లియున్న యార్యపుత్రుఁడు నీచేతులందున్నట్టు లీచెట్టునీడను జిత్రింపఁబడియె!

లక్ష్మ—

ఉ॥ తావులు మద్దిక్రొవ్విరుల ♦ తావుల తావులుగా, నవాంబుద
ప్రావృతనీల శృంగమగు ♦ నాగిరి మాల్యవదాఖ్య మమ్మ!

రాము—

వత్సా! వినఁజాల దుర్భర మి ♦ తఃపరగాథలు, చాలుఁ జాలు, సీ
తావనితావియోగ పరి ♦ తాపము దాపరమయ్యెఁ గ్రిమ్మఱన్॥

లక్ష్మ—విరమించెదను. కథ యింకను మిగిలియున్నది; కాని వదినగారు కడునలసటఁజెందిన ట్లున్నారు. కొండొక విశ్రమింతురు గాక.

సీత—ఆర్యపుత్రా! ఈ చిత్రపటదర్శనముచే నాకొక యభిలాషము వొడమినది. విన్నవించుకొందునా?

రాము—కా దాజ్ఞాపింపుము.

సీత—ప్రశాంతములగు తపోవనవాటికల విహరించుచు, మునిపత్నుల తోడ భాగీరథియందు జలకము లాడవలయునని,

రాము——వత్సా! ఈమెకోరిక వెంటనే చెల్లింపుమని గురుజన మిప్పుడే కదా సందేశించినది? కుదుపులేకుండ సుఖముగాఁ బ్రయాణము చేయఁదగిన రథము సిద్ధముచేయుము.

లక్ష్మ——చిత్తము. (అని నిష్క్రమించును.)

రాము——ప్రేయసీ! రమ్ము. ఈ వాతాయనముకడ నొకింత విశ్రమింతము.

సీత——ఔను అలసికచే నిద్దుర తూఁగుచున్నది.

రాము——అలాగైన నన్నాని మఱి నడువుము. (అనిచేయినంది) ఓహో! చిత్రపటముం జూచిన బడలికచేతను, వియోగ సంభ్రమముచేతను గాఁబోలు ముచ్చెమరుపోసిన దీబాహులత; నాకంఠమున నర్పింపుము, (సీతబాహువుఁ దనమెడపై వైచికొని) చంద్రికరస్పర్శముచేఁ జెమ్మగిల్లిన చంద్రమణిహారమువలెఁ జల్లనై... ఆహా మనోహారిణీ; నీ బాహులతాసంస్పర్శముచే నాశరీర మమృతవిలేపన మందినట్లున్నది. అనిర్వచనీయమగు వికారమేదియో యావిర్భవించి, నన్నాకస్మికమూర్ఛాపారవశ్యమున ముంచివేయుచున్నది. ఇది నిద్రయో లేక సమ్మోహాపారవశ్యమో నిర్ణయింపరాకున్నది.

సీత——మనోరమణా! మీహృదయము నిరంతరము నాయందు సుప్రసన్నమైయుండును! ఇంతకంటె నేఁ గోరఁదగిన సౌభాగ్యమేమున్నది?

రాము——ఆహా! ప్రేయసీ!

గీ॥ ప్రణయమధురంబులైన నీ • భాషణములు
వాడువాఱిన జీవన • ప్రసవములకు
వికసనమ్ము లిందిరియమోహ • విభ్రమములు
శ్రవణపేయంబులు, మనోర • సాయనములు।

సీత——ఆర్యపుత్రా! ఇందువలననే మి మ్మందఱు ప్రియంవదు లందురు. ఇఁక శయనింతును. (అని శయ్యకొఱకు నటునిటు వెదకుచున్నది.)

రాము——ప్రేయసీ! ఏమి వెదకుచున్నావు? ఇదిగో,

చం॥ కలనయినన్ బరాంగనకుఁ • గాక వివాహము యాదిగా భవ
ల్లలితతనూపలాలస వి • లాససుఖానుభవ ప్రశస్తమై
చెలువ! గృహంబునన్ గహన • సీమల నిత్యుచితంపు సేవలన్
గొలిచెడి రామబాహువిది • గో తలదిండగు నీకు జానకీ! ॥

సీత—కృతార్థురాలను (రామబాహువు దలాపిగా నిడికొని నిద్రించును.)

రాము——ఏమిది! ప్రియంవద కప్పుడే నిద్రవచ్చినది! (స్నేహమున మేను నిమురుచు) ఆహా! ఆనుకూల్యవతియగు నిల్లాలివలని సౌఖ్యమున కింతయని విలువ యెక్కడిది?

ఉ॥ ఈ మహిళాలలామము గృ • హేందిర; కన్నన కీమెమూర్తి ది
వ్యామృతవర్తి, స్పర్శసుఖ • మా! హరిచందనచర్చ మేని, కో
కోమలిబాహువల్లి మెడ • కున్ వలిముత్తెసరమ్ము, రమ్యమే
యా మది కేతదీయము స • మస్త, మహా విరహంబు దక్కఁగన్ ॥

(ప్రతీహారి ప్రవేశించి) దేవా! వచ్చినాఁడు.

రాము—ఎవరు?

ప్రతీ—ఏలినవారి పాదసేవకుఁడు దుర్ముఖుఁడు.

రాము—(తనలో) శుద్ధాంతసంచారి నీదుర్ముఖుని పౌరజానపదులపై వేగు నడుపుటకు నియమించితిఁ గదా. (ప్రకాశముగా) రమ్మనుము.

(ప్రతీహారి నిష్క్రమించును)

దుర్ముఖుఁడు—— (ప్రవేశించి) అయ్యో! రాణిగారినిగుఱించిన యవాచ్యమగు నీజనాపవాదమును దేవర కెట్లుమనవి చేయుదును. తప్పదు. ఈదౌర్భాగ్యుని యుద్యోగ మట్టిది.

సీత—(నిద్దురలో) అయ్యో! ఆర్యపుత్రా! ఎక్కడనున్నావు!

రాము—ఓహో! చిత్రపటవీక్షణమువలని సంక్షోభకారణమగు వియోగభావనమునే కలవరించుచున్నట్లున్నది. అవును ప్రేముడికిది నైజమే,

శా॥ ఏ, దద్వైతము ఖేదమోదముల, నెం ♦ దే హాయిఁ జెందుక్ మనం,
బేదా నన్నిటఁ దోడునీడ, ప్రియ మెం ♦ దే పోదు ప్రాయంబుతోఁ,
నేదా నాఁటికినాఁటికిక్ బెఱుకునో ♦ హృద్యస్థితిక్ బ్రేమ సాం,
పా దాంపత్యశుభానుభోగమె కదా ♦ యాసింతు రెల్లనియుక్॥

దుర్ము—దేవా! జయము

రాము—దుర్ముఖుఁడా! నేఁటి విశేషములేమి?

దుర్ము—ఏమున్నవి. చల్లనియేలుబడిచే శ్రీరామచంద్రులు తమ తండ్రి గారినిగూడ మఱపించుచున్నారని పౌరులు వేనోళ్ళ మిమ్ముఁగొని యాడుచునే యున్నారు.

రాము—ఇది కేవలశ్లాఘావాక్యము. లోపములమాట చెప్పుము. నిన్ను వేగుబంపినది నాగుణకీర్తనము వినుటకుఁ గాదు.

దుర్ము—దేవా! నోట వక్కాణింప నేటికి? సర్వ మీపత్రమునఁ జూచి కొందు. (కాగితమిచ్చును.)

రాము—(కాగితమందుకొని ఈవలకరుదెంచి) ఈపత్రంబున నెట్టి విశేష మున్నదో! ఇతఁడు నోటవక్కాణించుటకే సంశయింప నేటికి? ఇదేదియో మహానర్థము కానోపు. (అని లోపలఁ జదువుకొని) హా! హా! హతోస్మి. (మూర్ఛిల్లును.)

దుర్ము—దేవా! ఉపశమింపుఁడు.

రాము—(మూర్ఛఁదేఱి) దుర్ముఖా! ఎంతఘోరమిది! ఇంతటి వైపరీత్యము గూడఁ బ్రపంచమునఁగలదా? అనన్యకన్యాసామాన్యమైన జన్మ ముచేతనే పరమపవిత్రమైన యీజానకీచరిత్రమునకా యీనీచ ప్రవాదము! అయ్యో, ఇంతకంటె నా కాకస్మికనిర్ఘాతపాతము మేలే! హాలాహల జ్వాలామాలికలచే భస్మీకరింపఁబడుట మేలే, హా! హా! చిరకాలపరగృహవాసముచే లోకులీ సీతంగుఱించి, యన్యథా భావింపక మానరని, లోకాతీతములగు నద్భుతో

పాయముల నెంత యుపశమింపఁ జేసినను, గడకు రావలసిన యాలేఁతమాట యెట్లో రాక తప్పినదికాదు. హా ; హతవిధీ ! నీనిర్ణయము నిరాఘాటముగ నిట్లు పరిణమింపవలసియుండఁగా, నావంటి ప్రాకృతుల పురుషకారము లేమక్కఱకువచ్చును; ఏమీ ; ఇందు నే నెవ్వండను ! సీతా పాతివ్రత్యనిర్ణేతలలోఁ బ్రాకృతులనం దగినవారెవ్వరు? వీతిహోత్రుఁడా! విశ్వంభరా దేవియా! విద్యాధరప్రముఖామరసేవ్యమానుఁడా విబుధనాయకుఁడా ! విష్టపత్రయైక గురుం డావసిష్ఠభగవానుఁడా; విశ్వవిఖ్యాతచరిత్రుఁడై విబుధేశ్వరు నర్ధాసన మలంకరించియున్న నా తండ్రి దశరథేశ్వరుఁడా ! ఇట్టివా రేకగ్రీవముగ " జానకి నిర్దోష నిర్దోష నిర్దోష "యని పలుమా ఱుద్ఘోషించి నిర్ణయించిన యీమె సౌశీల్యమునకు, మరల నేఁ డిట్టి మిథ్యాప్రవాదము సంభవించుట, నాదౌర్భాగ్య పరిపాకము గాక వేఱేమున్నది! కాని యిప్పుడేది కర్తవ్యము (విమర్శించి) ఆహా! ఈరాముని జీవయాత్రయం దింతకంటెఁ గఠోరమైన విషమావస్థ యుండునా ? మరియు నేయుపాయముచేఁ బ్రజాసముదాయమును సమాధాన పఱుపఁగలను? (ఆలోచించి నిర్ణయముతో) ఇంక నొక్కటియె యుపాయము. (దుఃఖముతో) హా ! జానకీ! సవనమహీనందనీ ! (ఆసు దుఃఖ మడంచుకొని) ఛీ! ఇప్పుడు దుఃఖమునకవకాశము లేదు. ఎట్టి గాఢప్రయత్నములతోనైనను, బ్రజారాధనదీక్షం గాపాడుకొనుటయే కదా యిక్ష్వాకురాజధర్మము. అందున కేకదా తండ్రిగారు నన్నును గడకుఁ దన ప్రాణములఁగూడఁ గోల్పడినది. వసిష్ఠభగవానులు నాకీవిషయమై సందేశించిన దిప్పుడేకదా ? జగదేకస్తుతిపాత్రులగు హరిశ్చంద్రాది నరేంద్రుల సాధుప్రవర్తనములచేఁ బరమపవిత్రమగు నా సూర్య

వంశ చారిత్రమునకు నామూలమున నేఁడేమేని కళంకలేశము సంభవించినచో ఛీ ఛీ నాజన్మము కాల్పనా? హా దేవీ! హా! సవనమహీతనూభవా! స్వజన్మానుగ్రహపవిత్రితవసుంధరా! హా! నిమిజనకవంశవర్ధనీ! హా! పావకవసిష్ఠారుంధతీప్రశస్తశీల శాలినీ! హా! రామమయజీవితా! హా మహారణ్యవాసప్రియసఖీ! హా ప్రియస్తోకవాదినీ! ఇట్టి నీకా; తుదకీయవస్థాపరిణామము. హా జానకీ! లోకములన్నియు నీవలన సుశ్లోకములగుచున్నను నీవు మాత్రము లోకమునకుఁ గాకపోయితివిగా.

గీ॥ పరమ సాధ్వీత్వ సామ్రాజ్య ♦ పట్టమంది
ముజ్జగము లేలుచున్న యో ♦ ముద్దరాల
పాపవిధిచేత మిథ్యా ప్ర ♦ వాదమంది
యనఘవై దిక్కుమాలి య ♦ ల్లాడ వలసె॥

(అని కాగిలముపై నేమియో వ్రాసి) దుర్ముఖా! నీవు పోయి మా యీ క్రొత్తరాజు నీకీయాజ్ఞాపత్రమును బంపినాఁడని లక్ష్మణునకిమ్ము.

దుర్ము—దేవా! దుర్జనుల వాక్కులు లెక్కగొని, పవిత్రరఘుకుల సంతానమునుమోసియున్న యగ్నిపరిశుద్ధురాలగు దేవిగారియెడ నేమో ఘోరనిర్ణయము సంకల్పించినట్లున్నారు?

రాము—పాపము శాంతించుఁగాక! దుర్ముఖా! నా ప్రజలు దుర్జనులనవచ్చునా?

గీ॥ ప్రజల కభిమాన మిక్ష్వాకు ♦ వంశమనిన
విధివశత నందె నిందకుఁ ♦ బీజ మొదవె
అగ్ని పరిశుద్ధిఁ జేసితి ♦ మంటిమేని
అగుననుచు నమ్ము దూరవ్ర ♦ త్యాంత మెవఁడు? ॥

దుర్ము—హా! దేవీ! (దుఃఖముతోఁ బోవును.)

రాము—హా హా! కఠోరమైన రాజధర్మము నన్నెంత పాషాణహృద

యునిగా మార్చినది. అయ్యో బేలా! జానకీ; నాపై నెంత
పేరాసగొంటివి. ఎంత మురియుచుంటివి.

సీ॥ పనితత్తె లెందఱు • న్నను బైటచెఱఁగునఁ దుడిచి పాదుక లీవె • దొడిగినావు
యుపచార మెప్పుడే • దోయంచు నేమర కెలమి నామనసులో • మెలఁగినావు
మురిపెంపు రాచకూఁ • తురవయ్యు నతఁగూడి యడవి కాఁపుర మో ర్తి • నడిపినావు
రాసి అంపానఁ గా • రాడు రక్కసి ధిక్కరించి యీయువు నిల్వ • రించినావు
గీ॥ ఇట్టినినుఁ జిచ్చువందోసి • నట్టి నాదు నేర మొకలెక్కయనక మ • న్నించినావు
ఎంతమురిసితి వింతిరో! • యేమిఫలము కన్నుగుట్టైను విధికి నీ • కాఁపురంబు॥

నెచ్చెలీ! కడగండ్లన్నియుఁ దొలఁగినవి కొంతకాలమునుండియైన సుఖించుచుంటిమని సంతసించుచుండ నింతలో నిట్టియుపద్రవము సంభవింపవలయునా? అంతయైనను లోకము నీయొక్క నవిశ్వాసమే వహింపవలెనా? కానీ జనకనందినీ! నీసదాచారమెవ్వరు విశ్వసించినను విశ్వసింపకున్నను, బరమపవిత్రములగు నీచరణాంభోజములంటి నచింతు నిదిగో,

శా॥ నే నావంతయు నీసుశీలతకు సం • దేహింప, నిన్నార్చి యే
మేనిన్ గీడనుకొన్న నాకు నరకం • బే జన్మజన్మాల క
య్యో నారీమణి! యన్యాయద్విత్వయ మొం • దో పావనంబయ్యె నీ
చే, నట్లయ్యుఁ బ్రవాదమిట్టిది జనిం • చెన్ నాదునిర్భాగ్యతన్॥

ఇంక నేమనుకొన్న నేమిప్రయోజనము? క్రూరకర్ముఁడనై బీభత్సకార్య మొనరించితి.

గీ॥ పిన్ననాఁటనుండి • పెంచిన ప్రియురాలిఁ
బొరుపులేని స్నేహ • పూర్ణురాలిఁ
గైతవమున మిత్తి • వాత వేయుచునుంటి;
చెనఁటియొకఁడు యింటి • చిలుక నట్లు॥

జానకీ! పొమ్ము; నీకును నీరాముసకునుగల ఋణానుబంధము నేఁటితోఁ గడముట్టినది. ఈ పాపకన్నులకు నీమూర్తిం జూచుకొను కడపటిభాగ్య మిదియే.

సీ॥ నీలాలమేలుంగ • రాల ముంగురుల కోసకి! యిదే కడసారి • సంతరింపు
లలితంపు నీతనూ • లత కిదే మానినీ! కడసారి నామేని • కౌఁగిలింత
నిద్దంపు నీచెక్కు • టద్దంబులకు నిదే చానరో! నాకడ • సారిముద్దు
పరమపావనము నీ • చరణాబ్జముల కిదే జానకీ! నాకడ • సారిమ్రొక్కు
గీ॥ నేఁటితోఁ దీరె నాకును • నీకు ఋణము సుఖముగా నీవునీరాడి • సుతులఁగాంచి
కానిక్రింతల నెందైనఁ • గాని బ్రతుకు వేఁడికన్నీళ్లతో నిన్ను • విడిచినాఁడ॥

చాలు నింకేటికిఁ బాపకర్ముఁడనైన నేను స్పృశించుచు దేవి నప
విత్రపఱుపవలయును?

ఆ॥ వె॥ చను మపూర్వకర్మ • చండాలు నన్నుఁ బాసి
యంటఁబోకు ముగ్ధ • రాల! నన్ను
ఆశ్రయించినావు • హరిచందనభ్రాంతి
విలయమూలమైన • విషకుజంబు॥

అయ్యో; జానకీ! పరమనీచమైన యీ రామునిపాణి నేడు హ
స్తాగ్రమున గ్రహించితివో కాని నీకాఁపురమంతయు నిష్ఠురములగు కష్ట
ములతోడనే కడముట్టుచున్నది. కానిమ్ము, ఇట్టి ప్రేమానుబంధమునకు
వియోగమే గ నైకస్థానము. హా! హా! జీవలోక మెంతలో విపర్యస్త
మైనది? నేఁటితో రామునిజీవయాత్ర నిష్ప్రయోజనమైపోయినది. ప్రపంచ
మంతయు జీర్ణారణ్యమైపోయినది. దుస్సహదుఃఖానుభవమునకే యీ
రామునిశరీరమునఁ జైతన్యము శూన్యముగాకున్నది. వజ్రమయశస్త్రికలై
హృదయ మర్మములం జీఱచుచుఁ గోయుచు నీమొండిప్రాణంబు లింకను
రాలిపోకున్నవి కదా! హా అంబా అరుంధతీ! హా భగవానులారా వసిష్ఠ
విశ్వామిత్రులారా! హా దేవీ భూతధాత్రీ! హా మామా జనకరాజేంద్ర!
హా లంకాధిపతీ విభీషణా! హా ప్రియసఖా సుగ్రీవ! హా సౌమ్య
అంజనాతనయా! హా సఖీ త్రిజటా! మీరందఱు శ్రీరామహతకునిచేఁ బరా
భూతులై పోయితిరి. ఛీ! కృతఘ్నుఁడనైన నేను వారిం జేర్కొనుటకైన
నర్హుఁడనా?

శా॥ బాలింగా నమ్మి యురంబునన్ నిదురమై ♦ పన్నెండు ప్రేమంపుటి
ల్లాలిన్ దీని గృహాంతరన్ బనిచవే ♦ లాలోలయా నింకఁజూ
లాలిన్ హా! దయమాలి నేఁడు బలిఁగా ♦ నర్పించుచుంటిన్, మహా
త్తాలాభీలకరాళకాననకిరా ♦ తవ్రాత మధ్యంబునన్ ॥

(తెరలో) అబ్రహ్మణ్యము అబ్రహ్మణ్యము.

రాము—(ఆకర్ణించి) ఎవరక్కడ ఆగగ్గోలేమో తెలిసికొనుము.

(మరలఁ దెరలో)

గీ॥ యామునీయతటంబులం ♦ దత్యుదగ్ర
తపము గావించుకొను తపో ♦ ధనులు వారు,
క్రూరలవణాసురుని బారిఁ ♦ గుతిలపడుచు
దేవ! నీ ప్రాపుఁ జేర నే ♦ తెంచినారు॥

రాము—(కోపముతో) ఏమి ఇంకను రాక్షసభయమా! ఇదిగో దురా
త్ముఁడగు నాకుంభీనసపుత్త్రుని సంహరించుటకు శత్రుఘ్నుని
బంపెదను. జడియనలదనుము పొమ్ము. హా దేవీ! ఏమి కాను
న్నావో, నిన్నెవ్వరి కొప్పగించి పోవుదును.

సీ॥ నీకన్న కాన్ప నీ ♦ వే కాచికొనుమమ్మ భగవతీ! భూదేవి! ♦ భద్రమమ్మ
నీయింటికోడ లీ ♦ నెలఁత ఁబాలింపుమా లోకబంధూ! కృపా ♦ లోకనమున
మిముఁ జూడవచ్చు నీ ♦ మేదినీసుత సీత వరయరే తబిసి ము ♦ త్తైదులార!
జనకరాజర్షి పెం ♦ చినముద్దు గూఁతు నీ చానఁ బ్రోవరె దివ్య ♦ మౌనులార!
గీ॥ దిక్కుతినసీత కిఁక నీవె ♦ దిక్కటంచుఁ దలఁచి నీకొప్పగించి నేఁ ♦ డొలఁగుచుంటి
అరయు మెట్లేని యాపన్న ♦ యైన దీనిఁ గరుణదలఁపూని దివిజగంగా భవాని! ॥

(నిష్క్రమించును.)

సీత—(కలలో) హా! ఆర్యపుత్త్రా! హా సౌమ్య! (దిగ్గున లేచి) ఆర్య
పుత్త్రవియోగము చే నల్లాడుచున్నట్లు లెంత పాడుకలఁ గంటిని!
(అటు నిటుఁ జూచి) హా! హా! నిద్రపోవుచున్న నన్నెక్క

దానిం జేసి యార్యపుత్త్రుఁడు వెడలిపోయెనా? కానీ! ఎవరక్కడ!

దుర్ము—(ప్రవేశించి) "అమ్మా! రథము సిద్ధముచేసితిని, ఆరోహింతురుగాక" అని కుమార లక్ష్మణులు తమతో విన్నపముచేయుమని సెలవిచ్చినారు.

సీత—(ఆలోచించి) ఇదిగో వచ్చుచున్నాను.

దుర్ము—దేవీ! ఇటురండు, ఇటురండు.

సీత—రఘుకులదేవతలకు నమస్కారములు.తపోధనుల కభివందనములు.

(అందఱు నిష్క్రమింతురు.)

ప్రథమాంకము.

సంపూర్ణము.



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# ఉత్తర రాఘవము.

## ద్వితీయాంకము.

(అరణ్యమున సూతచోదితమగు రథముపై సీతయు, లక్ష్మణుఁడును ప్రవేశింతురు.)

సూత—అమ్మా! రథము నడుకానలోఁ బ్రవేశించినది. ఇచ్చటిదారి, కడుమిట్టపల్లములతో నున్నది. హెచ్చరిక విన్నవించుకొనుచున్నాను.

సీత—ఆర్యా! రథ మాపుఁడు. కుదు పెక్కువగ నున్నది. కూరుచుండ లేను. కొంతదూరము నడచెదను. సౌమిత్రీ! దిగుము. (అందఱు దిగుదురు.)

లక్ష్మ—సూతుఁడా! నే మరలివచ్చునంతలో గుఱ్ఱములఁగడిగి మేఁపుకొనుచుండుము. అమ్మా! మెల్లఁగ దారి చూచినడువుము. (నడుచుచుఁ దనలో) గమ్యస్థానము చేరువరకు సీయమ కేదే నొకముచ్చటఁ జెప్పుచుండవలయు. (ప్రకాశముగా) అమ్మా! చూడుము. ప్రకృతిరమణీయమైన యీయరణ్య సౌభాగ్యము పరిచితులమగు మనకే వింతగనున్నది!

సీ॥ తఱచుగానల్లి క్రి • క్కిఱిసి, చీఁకటులీను తరువల్లికల పర్వ • తముల చఱులు
చఱుల వెంబడిఁ బన్న • జాలువై ప్రవహించు నిసుక దేలిన సెల • యేళ్లు, గములు
సెలయేళ్ళ యిరుగేలఁ • గల గోవజవ్వాది బుగబుగ ల్వెలయించు • పొదరుటిండ్లు
పొదరుటిండులఁ జెంచు • ల్రూఁబోండ్లు పిల్లనగ్రోవులం బాడు మే • ల్కలుకుఁబాట
గీ॥ పాటవాలించి, పరవశ • త్వమున మేఁతమాని వీనులనిక్కించి • మార్నుపడుచు
లేళ్లు నిలఁబడు పచ్చిక • బీళ్లకలిమి నద్భుతావహమీయర • ణ్యంబు సృష్టి॥

సీత——స్వామిత్రీ! నేను చిన్నబుచ్చుకొందు నేమోయని, యడిగినదే తడవుగా మీయన్న గారు నాప్రయాణమున కంగీకరించిరి. కాని బయలుదేరు నప్పటి నుండియు నొకటిపై నొకటిగా దుర్నిమిత్తములే నాకుఁబొడగట్టుచున్నవి. నిర్నిమిత్తముగ నాకనము విఱిగి నెత్తిపైఁ బడునట్లున్నది. మనసేమో పరిపరివిధముల విలవిల లాడుచున్నది. మఱదీ! యెందులకో కాని,

గీ॥ సృష్టిలో నేదిగన్నను ♦ నేది విన్న
నాత్మ, భయసంశయముల న ♦ ల్లాడఁజొచ్చె
నేఁ డదేమో చెఱంబడ్డ ♦ నాఁడువోలె
మనసు చెయివెట్టి కలఁచిన ♦ మాద్రి నుండె!

లక్ష్మ——(స్వగతము) పాపమీమంద భాగ్యురాలికి రానున్న దురవస్థ యీదుర్నిమిత్తము వలననే సూచితమగుచున్నది. ఈయమ సంశయములకు నేనేమని పరిహారములు చెప్పఁగలను. (ప్రకాశముగా) అమ్మా! ఈశకునము లొక్కొకతఱిఁగాకతాళీయముగ సరిపోవునవి, వీని కేమి.

చ॥ ఇలజనియించి నీవొకరి ♦ కెగ్గొనరింపవు; పూర్వకర్మదు
ష్ఫల మనుభోగ్యమాటఁ బతిఁ ♦ బాసి చిరంబు విపత్పరంపరం
వలనెఁగృశింపఁగా; విధివి ♦ పాకము దాఁటఁదరంబె, యేలయు
మ్మలికఁగలంగఁ జింతిలిన ♦ మాత్రము తప్పునె వచ్చుకష్టముల్?

సీత——వత్సా! నీవెంతధైర్యముఁజెప్పుచున్నను నామది కేమియు సమాధానముగా లేదు. ఈప్రయాణము నాకెంతమాత్రము సంతోషాస్పదముగా లేదు. ఇక్కడినుండి పురంబునకు మరలి పోవుటయే మేలు. రథం బింక మరలింపుము.

లక్ష్మ——(స్వగతము) అయ్యో! నాకిప్పు డేది తెఱవు.

గీ॥ అరదముమరల్ప నన్ను భ ♦ యార్తయగుచు
వేడికొను జానకింజూచి, ♦ విభునియాజ్ఞ
దలంచుకొన్న; రథంబు ముం ♦ దఱకుఁగాని
వెనుకకుఁగాని నడిపింప ♦ వెఱచు మనసు॥

రాజాజ్ఞ నేకారణమునఁగాని యుల్లంఘింప రాదుగదా. (ప్రకాశముగా) జానకీదేవీ! దిగులొందినకొలంది డెందమున కేవియో పాడు తలంపులూరుచునేయుండును. హృదయము కొంత కుదురుపఱచుకొనుము.

సీత—వత్సా! సౌమిత్రీ! నిర్నిమిత్తంబుగ నాచిత్తమున కిట్టిపరితాపము కలుగుట కేమికారణమో తెలియకున్నది. అవస్థలంబడి చెడియున్న ప్రాణముగావున నేమాత్రము మనసుచివుక్కుమన్నను వెనుకటినాదురవస్థ స్మరణకు వచ్చుచుండును. నాయనా! ఋష్యశృంగాశ్రమమునుండి మఱేమియు దుర్వార్తవచ్చియుండదుగదా. ఇంతకు నేనుబయలుదేరునప్పటి కార్యపుత్రుఁడు కొలువుకూట మందుండుటచే నొక్కమాఱు చూచివచ్చుట కవకాశము కలుగదయ్యెను. వత్సా! నీవు మీయన్నగారినిజూచియే వచ్చితివిగదా? వారు క్షేమముగానున్నారా? చెప్పుము.

లక్ష్మ—దేవీ! యెవ్వరిక్షేమమున కేకొఱంతయు లేదు. చూడుము,

మ॥ అనఘుల్ సంశయమెల్ల నల్లదె తరం ♦ గాభంగ గంగాతరం
గిణి; యాపొంత తపోవనంబు; సవనా ♦ గ్నిద్యోతమానంబు, కారణదేహుల్ నిరవగ్రహుల్ నిగమతం ♦ త్రివ్యగ్రులౌ తాపసా
గ్రణు లచ్చోవసియింతురు; వారల సప ♦ ర్యల్ నీకు శ్రేయంబగుల్॥

సీత—ఏమోకానిమ్ము. మిగిలివచ్చితిమి. మున్యాశ్రమదర్శనాభిలాషము నాకుఁ గలుగకుండినను బాగుండెడిది. ఆర్యపుత్రునివిడిచి

నేఁటికప్పుడే రెండుదినములు కావచ్చుచున్నది. అందువలన నాడెందము మఱింత దిగులొందుచున్నది. కానీ! ఆకనఁబడునది యేనా భాగీరథి? వత్సా! రఘుకులదేవతయగు నీభాగీరథీజన్మ మెంతపవిత్రమైనది.

లక్ష్మ—అమ్మా! ఒక్కజన్మమే యేల? ఈయమ చారిత్రమంతయుఁ బవిత్రమైనదే.

సీ॥ దేవదేవేశ్వర ♦ ధ్యేయమహా హరిపాదకమలనాళము నూతి ♦ కాగ్రహంబు
పరమహావధీలతా ♦ వాలమూలంబైన ప్రాలేయనగ ముగ్గు ♦ బాలగిండి
దరచంద్రచంద్రికా ♦ ధౌతవిస్తలమైన భవ్యజటాజూటంబు ♦ పడకటిల్లు
ప్రాజ్యమహేశ్వరయజ్ఞ ♦ వాటీపవిత్ర మార్యావర్తభూమి క్రీ ♦ డాంగణంబు
గీ॥ పరమపావనమైన జీ ♦ వనసమృద్ధి వెలయు యమునాతరంగిణి ♦ చెలిమికత్తె
ప్రబలరత్నాకరునితోడి ♦ బాంధవంబు పొగడఁదరమె యియ్యన్నదీ ♦ పుణ్యచరిత॥

(సీతా లక్ష్మణులు నదీతీరమున కేగుదురు.)

సీత—భగవతీ, భాగీరథీ! నమస్కారము. (నమస్కరించును.)

లక్ష్మ—దేవీ; మనమింక నావలిదరికిఁ జేరుదము, ఓరీ పల్లీ! మాకుఁ బడవసిద్ధము చేయుము.

పల్లె—దొరా! దయచేయుండి, సిద్ధముగానే ఉంది.

(సీతా లక్ష్మణు లవ్వలిదరికిఁ జేరుదురు-రథముతో సూతుఁడివ్వలనే నిలిచియుండును.)

సీత—వత్సా; సౌమిత్రీ! మనము దారితప్పి పెడదారింబడలేదుగదా? నాకేమో భయమగుచున్నది. ఇక్కడ నెక్కడను జనదారుల యాశ్రమస్థలంబులజాడయే కనఁబడదు చూడు; పోను బోను నాధైర్యముతోబాటు ప్రొద్దుగూడఁ గ్రుంకుచున్నది. చెవులు చిల్లులుపోవనఱచు కీఁచురాళ్ల యలికిడిదక్క మానిసియలికిడియే గానరాదు.

సీ॥ మునిమాపు సందెవా ♦ ర్చనకునై మిన్నేటిపాయ కేతెంచు తా ♦ పసులుగాని
లేఁగదూడల మరల్ ♦ రేగి యంభాయంచు సందెమ్ములేసుసాల ♦ మందగాని

తెలియేటియిసుక, తా • న్నెలకుప్పలాడి, యిండ్లకుఁ బోవు మునికుమా • రికలు గాని
కుశపత్రములఁ గోసి • కొని, యొండొరుం గెల్చుపరుగులఁ జను పిల్ల • వటులు గాని
గీ॥ తీరి వలిగిన కాల్నడ • దారి గాని, యిపటఁ గనరాదు మునిపల్లె • లెంతదవ్వొ
మూసికొనివచ్చుచున్నవి • మొలకయిరులు నేమిటికి వచ్చిన ప్రయాణ • మిది మఱంది!

లక్ష్మ—తల్లీ! యిది నీకై నీవే కోరి తెచ్చికొంటివి. చింతించుట యెందు
లకు? మున్యాశ్రమములు చూడవలె భయము మఱి లేదు.
చేసుకనే వచ్చితిమి.

సీత—అయ్యో సౌమిత్రీ! మన మంధకారమునఁ బడిపోవుదుమేమో

లక్ష్మ—అమ్మా! మన మేమి లోకమే యంధకారమునఁ బడనున్నది.

సీ॥ లోకబాంధవుని యా • లోకంబునకుఁ బాసి ప్రకృతి తేఁకొదగి • దారుణమయ్యె
నెలసంజ చిమ్మ్చెవం • దుటికిఁ బన్నిటితోడ సంధ్యాపురంధ్రి యా • స్తంగమించ
కనఁబాసి వెంటిజ • కృవ దుస్సహవియోగమున నెలుంగెత్తి వా • పోవుచుండె
తననాథుని ప్రవాస • మునకు గాసిలి తేఁటియెలుఁగుసఁ బద్మిని • యేడ్చుచుండె
గీ॥ వీరిఁ గని గుండె నీరయి • విపినరమయు విపులవిహగారవంబుల • వెక్కివెక్కి
యేడ్చుచున్నది, తల్లిరో! • యెన్నఁ దరమె కాలమహిమంబులో నెన్ని • కళలుగలవొ॥

సీత—ఏమి సౌమిత్రీ! ఏమో యుపన్యసించుచున్నావు. నేఁడు మొదటి
నుండియు నీవున్నవిధము నాకు మిక్కిలి సంశయాస్పదముగా
నున్నది. నాయనా! ఎన్నఁడుగాని ప్రసన్నతం బాయని నీవదనం
బిటు చిన్నవోవుట కేమికతమయ్యా?

సీ॥ అన్నగారేమైన • నాగ్రహించిరటన్న నీయందుఁ గాసంత • నెపము రాదు
పితృభార్య ప్రతికూల • విధిఁ జేసెనా యన్న ననుకూలదాంపత్య • మన్న మీఁదె
పొరపాటుచే నాడి • బొంకితి వనియన్నఁ దారలు తమగతు • ల్దప్పలేదు
యుద్ధరంగమునందు • నోడి వచ్చితివన్న సురలైన నిను దేరిఁ • చూడలేరు
గీ॥ ప్రజ లతిక్రాంతగౌరవ • భావులగుమ వందునిందున నిస్నేగ్గ • లాడిరనినఁ
బ్రజలకు విరోధిగాదు నీ • వర్తనంబు కటకటా! యేల నీకింత • గాని చింత॥

లక్ష్మ—(స్వగతము) అయ్యో ఈ యిల్లాలికిప్పుడు నేనేమని సమాధా
నముఁ జెప్పుదును. కర్ణకఠోరమైన శ్రీరామాజ్ఞ నీ సాధ్వీమణి

కెట్లు వచింతు. ఛీ! లక్ష్మణా! జన్మమెంతటిపాతకమునకు హేతుభూతమైనది. ఇంతకుమునుపే నీ జీవితమంతమైయుండిన నింతటి దారుణకృత్యము నీవలనజరిగియుండదుగదా. (కన్నీరుగార్చును)

సీత—(ఆతురతతో) ఏమి నాయనా! వెక్కి వెక్కి బాష్పజలంబుల విడుచుచున్నావు. చెప్పుము, నీపరితాపకారణమేమో తెలిపి నాకు మనశ్శాంతి కలిగింపుము.

లక్ష్మ—తల్లీ! నీకింకెక్కడి శాంతి.

గీ॥ సాధుజనములఁ బీడింప ♦ జన్మమెత్తి
చూపకున్నాఁడు పాపి ల ♦ క్ష్మణుఁడు పీఁడు
మనుఁది గాఁడన్న సీతల్లి ♦ భరముదీరు
కఠినశాపంబొసంగి పో ♦ కార్పుమమ్మ.

సీత—నాయనా! అదేమోయీ అట్లనుచున్నావు? ఇంతటి వైక్లబ్యమునకుఁ గారణమేమో యెఱిఁగింపవేమి?

లక్ష్మ—ఉ॥ తెంపున నింతదూరమరు ♦ దెంచి రఘుప్రభునాజ్ఞ నుల్లంఘిం
గింపక పోదునమ్మ! పురి ♦ కికఁ? వినుతల్లిరో! లోకనిందకుం
గొంపిలి రామచంద్రుఁడు వ ♦ నంబుల నీకు విడిరమ్మటంచు న
న్నంపె దురంతఘోరదురి ♦ తాళికిఁ జాలినవాఁడనౌటచే॥

(అని సీతపాదములపైఁబడును)

సీత—హా! రామచంద్రా! (మూర్ఛిల్లును)

లక్ష్మ—అయ్యో! ఈయిల్లాలి కెంతటి దుర్వార్తవినిపించితిని. హా రాఘవేంద్రా! సౌశీల్యగుణాభిజాతయగు నీ సీతామహాదేవిని జేతులార నీ కీకారణ్యంబున డించి యీమె దురవస్థనంతయుఁ గన్నులారఁ జూచి యోర్చుటకుండగిన కటికమానిసిననియా నన్నీ యీమహాకార్యమునందు నియమించితివి? అక్కటా!

దుఃఖపారవశ్యముచేఁ గలిగిన యీమూర్ఛ యింక నెంతటి
ముప్పునకుఁ గారణమౌనో గదా? అయ్యో! దైవమా!
దిక్కుమాలిన యీరామకుటుంబిని నీవిపత్తునుండి దరిఁజేర్చు
వారు లేరుగా! కాని,

శా॥ నాచిత్తంబు పవిత్రరామపదచిం ♦ తాయత్తమేనిన్, మనో
వాచాకర్మములందు ధర్మనిరతిన్ ♦ వర్తింతునేనిన్, ధరి
త్రీచక్రంబున "సత్యమేవ జయ"తీ ♦ తి ఖ్యాతి నిక్కంబయే
ని చూలాలి కపాయముల్ దొలఁగుఁగా ♦ కీ ఘోరమూర్ఛాగతిన్॥

సీత—(మూర్ఛనుండి లేచి) నాయనా! ఇదేమి కలయా? మునిపత్నులఁ
జూచిరమ్మని కదా మీ యన్నగారు నన్నంపినది? మఱిది!
మాటాడవేమి?

శా॥ అన్నా! లక్ష్మణ! నిందయేఁటి, ననుబా ♦ యంబూనుటేమీ, కలం
గన్నావో? కలఁతన్ వచించితివొ వ ♦ క్కాణింపు మింకొక్కమా
ఱన్నన్ హేతుకదుర్వియోగము నిజం ♦ బే యైనచో నింక నే
నున్నా, నున్నదిగంగ చెంగట నె, యే ♦ ట్లో ధ్యోగ మట్లయ్యెడున్॥

లక్ష్మ—తల్లీ! ఆత్మహత్య యెంతేనిపాతకము. అందున పరమాంతవు
గానున్నను విప్పుడే చేసి తెంపునకుఁ బూనితివా భ్రూణహత్యకుఁ
గూడ బాల్పడినదానవగుదువు. దేవీ! కలయూపు నీకు నా నోట
నేమని విశదీకరింతునమ్మా.

చ॥ పనిగొని నిన్ను నట్టడవి ♦ పాలొనరించినయట్టిపాపమే
నను దహియింపనుండ భువ ♦ నత్రయపావనివైన నిన్ను దు
ర్జనుఁ డొకఁ డాడినట్టి యుప ♦ రాధ మరుక్తుల నోటఁబీఁడుగా
వినుచు మహాంతపాపపరి ♦ వేదన కేమియుపోదుఁ దల్లిరో॥

దేవీ! నాహృదయము బ్రద్దలగుచున్నది. వక్కాణింపఁ జాలను. ఇదిగో రాజుగారి యాజ్ఞాపత్రిము.

సీత— (లోనఁ జదివికొని) అయ్యో! ఈనిందోదంతంబు వినియు నిలువు నీరుగా నాశరీరము భస్మీపటలముగాకుండెనే. అయ్యో! నేనెంత పాపమునకోర్చితి. హా రామచంద్రానుజా! మందభాగ్యురాలైన యీజానకి సౌఖ్యమునకేదియో యొకయంతరాయము సంభవించుచునేయుండును. సౌమిత్రి! నాఁడామాయామృగరంగంబును, నేఁడీ ప్రజాపవాదమును నీసీత జాతకమునకు దుష్టగ్రిహంబులై యీమరణాంతము వేధింపఁజొచ్చెనే అయ్యో! అయ్యో! ఎంతటిమాటపుట్టెను. అన్నా! ప్రాణముకన్న మిన్నగమన్నించు మీయన్నగారు నన్నీలాగున నడవిపాలు చేసెనన లోకమీాపరివాదముఁగూర్చి నిజమని విశ్వసింపకుండునా? సౌమిత్రీ! నిన్నఁగదా మీాయన్నగారు "దేవీ! నీవు నాప్రాణముకన్నను నెక్కుడు ప్రేమాస్పద"వని బహూకరించినది. ఇంతలో నింత విపర్యయంబెట్లు సంభవించెనయ్యొ? నాయనా! ఇట్టి యుపనింద మీారేచందమున విశ్వసించితిరి?

శా॥ ఆనాఁడంతపరీక్షనేఁ దెలియ లే • దా? పాపమో పుణ్యమో
ఆనిర్ణాయకు లిప్పుడేమయిరి? లేఁ • డా వేల్పుటేఁ, డగ్ని లేఁ
డా, నీరేజభవాది దేవతలు లే • రా? వారువీకేల లే
దా నన్నింతకునేలు నాపతి మన • స్సాక్ష్యంబు సల్లక్ష్యమై॥

సౌమిత్రీ! అఁడుదాననైన నాకు బుద్ధి యత్యల్పమైనను సకల ధర్మాధర్మ కోవిదుఁడనై సుగుణములయందు మీా యన్నగారి కెందును దీసిపోనివాఁడవు నీవైన నిష్పక్షపాత బుద్ధితో నాయవస్థ యించుక యోజింపుము,

సీ॥ నిందించ నేమూఁడు ♦ నీచాధముం డెవండో పతి తాఁ గణించు టే ♦ పాడియయ్యె
పాడియే యనిమూఁడు ♦ నాఁడగ్ని యందు నే నుఱికిన కథగూడ ♦ మఱతురయ్యె
మఱతు రేమూఁడు మీ ♦ మాటతా నేనాఁడు మునుదెల్పనే మొగ ♦ మోటమయ్యె
మొగమోటమే మూఁడు ♦ తగవెంచి నన్ను నీరాముఁడాళ భరింపఁ ♦ గూడదయ్యె

గీ॥ అకటకట! నిందుమూలాలి ♦ నైననన్ను విడిచి తద్ధ్యానమైన యీ ♦ యడవియందు
దిక్కెవరు లక్ష్మణా! మీఁద ♦ దినకు నింక నెవరు నీరాఁడ్చువారు నా ♦ కేది తీరు॥

మఱఁది! ఎంత వైపరీత్యము సంభవించెను. భగవంతుండగు నగ్ని భట్టారకునిచే నాఖ్యాతంబైన నాచరిత్రమున కిప్పుడు మరలఁ బ్రత్యాఖ్యానములు బయలుదేరినవిగా?

లక్ష్మ—దేవి! దేవయజనసంభవా! మా దురదృష్టవశమున నిట్టియనాచ్యప్రవాదములు సంభవించినవిగాని, నిసాశీల్య మొక్కఁగు నిర్ణయింపవలసినదా?

మ॥ అనలుం డెవ్వఁడు నీచరిత్రకు నుపా ♦ ఖ్యానంబుగా వింప, నీ
తనుసంస్పర్శము సర్వభక్షకతచే ♦ తం గల్గు దుష్పాప మా
తనికింబాపె, భవన్మహామహిమయా ♦ తంగాక, లోకత్రియీ
జనవిద్రావణరావణాద్యసురహిం ♦ సల్ మాకునుర్ శక్యమే?॥

తల్లీ! ఇట్టి సుశ్లోకపు నీవు పలుగాకులగు నీలోకులకుఁ గాక పోయితివి.

సీత—నాయనా! ఇది నానోఁచిన నోము ఫలము. ఇందులకు లోకులు దూష్యులుగారు.

లక్ష్మ—తల్లీ! లోకులుగారు మొదటినుండియు నేనే దూష్యుఁడను. నీకింతటి ఘోరపర్యవసానమునకుఁ గారణమైన యీరావణాపహారణమునకు నాది కారణమే నేను గదా.

మ॥ 'దనుజుల్ గుమ్మలుచుంద్రు, మీఁవదినెఖ•ద్రిం'బంచు మాయన్న నా
యునికిన్నమ్మి, కురంగమేయఁజన న ♦ య్యో! యోగ్మిలే కొంటిగా

వనవీథిన్ నినుడించి రావణున కొ ♦ ప్పంజెప్పితిన్ గాఁడు, త
ప్పనిపాపంబున నేఁడు నీయడవికొ ♦ ప్పంజెప్పితిన్ దల్లిరో॥

సీత—తండ్రీ! ఆవృత్తాంతము తలపెట్టకుము. అప్పటి నాగట్టివాఁడుతన
మునకు నాయంతరాత్మ యిప్పటికెంత క్షోభించుచుండునో యా
పరమేశ్వరుఁడెఱుంగు. ఒప్పులకుప్పవైన నీయం దొకనాఁడైనఁ
దప్పు గలుగునయ్యా? కలలోనైన నీవు నాకపకారంబు దలఁ
తువా నాయనా?

ఉ॥ నీవు మఱందివా దలఁప ♦ నిక్కము బిడ్డవుగాక నాకు, వ
త్సా! వనవాసదుఃఖ మిసు ♦ మంతయుఁ గప్పడకుండ నిత్యముం
బూవులఁ బాదులందనిచి ♦ ప్రోచితి నన్నుపచారభంగి; నీ
పావనశీలమించుక య ♦ వాచ్యములన్ నినుఁ దిట్టితిన్ గదా॥

బిడ్డా; ఏపాపమెఱుంగని నిన్నుఁ బాపపుఁబలుకులాడిన యీపా
పాత్మురాలి కప్పటి శిక్షానుభవము చాలునా? మరల నింతటిదురవస్థ
రాఁదగినదే. తండ్రీ! అంతనుఁగాని యింతనుఁగాని నీవుచేసినదేమున్నది?
మొదటినుండియు నన్నుఁగట్టఁ దాళ్లు నేనే తెచ్చికొంటినని చూడు;

సీ॥ మాయదారిమెకంబుకై యాసపడి, నాఁడు పతి నలయించిన ♦ పాతకంబు
మతిమాలి నాఁడు నీ ♦ హితబోధఁ గైకొనక యనఘాత్మ నిన్నుదూ ♦ రిన యఘంబు
కలుషరక్కసునింటఁ ♦ జెఱఁబడి యన్నినాళ్లుఁ గాలముఁబుచ్చి ♦ నట్టిదోసము
పతిచేత నిరసింపఁ ♦ బడి చిచ్చునఁ జొచ్చి మొండినై జీవించి ♦ యుండుకలుష
గీ॥ మన్నిఁటికి నెల్లముఖ్యమై ♦ యవనిసైన నాఁకుఁ బుట్టువునై పుట్టి ♦ నట్టిపాప
మింతయును బండి నన్నిట్లు ♦ తేమచుండఁ బరులు కారకులనుటకా ♦ స్పదము గలదె॥

లక్ష్మ—తల్లీ! సతీమతల్లీ! ఎంతమాటాడికొంటివి. ఆజన్మపరిశుద్ధు
రాలవగు నీకుఁగూడ నొక పాపమా?

ఉ॥ నీవు పతివ్రతామణివి ♦ నిజజననం బిలకున్ విశేషపు
ణ్యావహమయ్యె, సచ్చరిత ♦ మా మగనాండ్రకు మేలుబంతి, నీ

పావనమూర్తి నిత్యము ప్ర • భాతమునన్ గనుఁగొన్న జన్మజ
న్మావిలపాపముల్ దొలఁగ • నా ననుఁబోలిన దుర్జనాళికిన్?॥

అమ్మా! ఇట్టి లోకమాతను నిన్నుఁ జేతులార నీక్రూరారణ్యమున కొప్పగించిన నా ఘోరపాప మెన్నిజన్మాంతరములఁ దీరవలయు? ఇప్పుడు నిన్నూరడించుటకైన నాకు నోఱు లేదుగదా.

సీత—సౌమిత్రీ! నీవమాయకుఁడవు! ఈమందభాగ్యురాలి కూరాటు గలిగింపఁగలవా రెవ్వరు? దుర్భర దుఃఖానుభవమునకై యేర్పడినదే కదా యీజన్మము. కావున నీకు దోషమేమి? పుట్టినింటఁజూచి నను మెట్టినింటఁజూచినను గంపంత బలగమే; జగదేకపూజ్యమగు సామ్రాజ్యవైభవమే, లోకేశ్వరేశ్వరుండవంటి దగిన ప్రాణేశ్వరుఁడే; వినయధురంధరులగు నయ్యలవారు మఱఁదులే. ఇంత యుండియు నేమి ప్రయోజనము,

చ॥ 'బ్రతికినయంత కాల మప • వాదములన్ భరియించి, భాగ్యయుక్
బలిమియును ముద్దుముచ్చటల • భాగ్యములేమియు లేక, మొండినై
బ్రతుకుము' మటంచు నానొసట • వ్రాసెను దీరిచి మూఁడుబాతులన్
మతకరిబ్రహ్మ, నీవిపుడు • మాన్పఁగ నాతలవ్రాఁత లక్ష్మణా!॥

లక్ష్మ—తల్లీ! దుఃఖింపకుము. ఎల్లకాలం బీకష్టములే కాఁపురములు చేయునా? ఎప్పటికేమో యెవరెఱుంగుదురు. బండ్లోడలగును, ఓడలు బండ్లగును. ఏనాఁటికైన నీకు శుభదినములు రాకపోవు?

సీత—నాయనా! ఇప్పటికి నిట్లయినదికదా!

సీ॥ కలికంతుచాపంబు • విఱిచి నన్నుద్వాహ మాడిననాఁటిగా • ఢానురక్తి
అవిరళయుక్తిఁ గ్రూరకా • కాసురున్ వెలిపించి నన్నుఁగాపాడిన • నాఁటిప్రేమ
వరహాంత్రియో చుప్ప • నాతిముచ్చ్ఛంజెవుల్ సఱకి నన్నురక్షించు • నాఁటిచెలిమి
వనశాశిఁగట్టి రా • వణుఁగొట్టి నాచెఱం గడతేర్చినట్టి ని • క్కంపుసెనరు

గీ॥ నేఁటితో నొక్కపౌరుని • మాటచేత వ్యర్థమగునెట్లు నాపాప • వశతఁగాక
రామచంద్రుని దూఱంగ • నేమిగలదు విధివిధానంబు నెవరు లే • ప్పింతురయ్య॥

ఇంతకు స్వామిత్రీ! సత్యసంధునకు శ్రీరామచంద్రునకు నాపైఁ గల యపూర్వప్రేమానుబంధ మీయపవాదము వలనఁ దొలంగునని తలంతునా ?

లక్ష్మ — తల్లీ! ఛాయాప్రభాకరుల యనుబంధమెన్నఁటి కైన మాఱునా?

సీత — వత్సా ! మాఱదు నిశ్చయమే కాని, ఒక్కవిషయము మాత్రము నాహృదయమును వేధింపక మానదు. చూడు,

చ॥ తనయపనిందఁ బాపికొను • దారికి నేనును లోనుగానె ? యి
ట్లని తుదిమాట కేని తగ • నా? మొగమోటముఁ బెంచి తేనియా
జ్ఞను మరలింతునయ్య? కడ • సారి దనుం బెడబాయునో మనం
బునఁగల నెయ్యముం దెలుపు • ముచ్చటకేనియు నోఁచనైతినా ?

లక్ష్మ — తల్లీ ! అట్లనకు, తనప్రాణముకన్నను ప్రేమాస్పదవగు నిన్ను, పరమపతివ్రతాశిరోమణివగు నిన్ను, నిరపరాధవగు నిన్ను గృహిణివగు నిన్నుఁ దనహృదయము విశ్వసింపని కేవల మిథ్యాప్రవాదమునకై మొగమెదుటఁ గఠోరముగ “నన్నువిడిచి యెందేని యరణ్యభూములకుం బొమ్ము” అని యాజ్ఞాపించుటకుఁ గరుణాస్వభావుండగు శ్రీరామచంద్రునకు నోరాడు నమ్మా? చూడు,

చ॥ ఒకయెడ స్వప్రజానికృతి • యొక్కెడ నాత్మసతీవియోగ మా
త్మకువిషమంబులన్, బలువి • ధంబుల యోజనఁజేసి, భూమినే
తకు జనరంజనంబె విహి • తంబగుటన్, మొగమోటమెంచి యిం
తకు ననుఁ బాపె నీపతి మ • నంబెటువంటిదిదో నీవెఱుంగవే ! ॥

క॥ శరణంబిఁక నీచరిత
స్మరణంబే నీదుపతికి • జానకి ! జీవ

స్మరణంబునఁ దగు తన సం
సరణంబుఁ దరింప విరహ • సంతాపమునన్ ॥

సీత—వత్సా! దుఃఖపరవశత్వమున నేమో యాడితిఁగాక, సరళహృదయుండగు నాపతికి నాపైఁగల స్నేహవాత్సల్యం బెఱుఁగని దాననుగాను. నేను మున్ను రావణక్రూరనిర్బంధముననున్న సమయమునఁ గరుణాసముద్రుఁ డాతండు నాకై యనుభవించిన పరితాప మాంజనేయునిచే విన్నదాననుగానా? అక్కటా! రాజధర్మ మెంతదారుణమైనది. చేపట్టిన యిల్లాలియెడనైన జాలిదలంచుటకు స్వాతంత్ర్యము నొసంగదయ్యెనే? నన్నుఁగూర్చి ప్రజాసముదాయమున వ్యాపించినది మిధ్యాప్రవాదమని తెలిసియుండియు నిశ్శంకసాహసమునకుం దెగి జగదారాధన దీక్షాధురంధరుండగుట, కాకుత్స్థాన్వయప్రదీపకుండగు శ్రీరామభూపాలున కొక్కనికిం జెల్లెఁగాక, యొరులిట్టి వీరవ్రతం బాచరింపఁ గల్గుదురే! ఇంతకు నాయనా! నాకీజన్మమున శ్రీరామచంద్రచరణారవిందపునస్సేవాభాగ్య మెన్నఁటికైన లభించునా?

సీ॥ ఈకనుంగవ యెన్నఁ • డేనిఁ గన్గొనునొకో కామితస్ఫూర్తి శ్రీ • రామమూర్తి
ఈకర్ణయుగ మెన్నఁ • డే వినం గలుగునో కపురంపుఁ బలుకు రా • ఘవుని పలుకు
ఈకరద్వయ మెన్నఁ • డేని సేవించునో మోక్షప్రదంబు రా • ముని పదంబు
ఈజీవితం బెన్నఁ • డేని పావనమౌనో ప్రాణేశు చెలిమిఁ ద • పంబు కలిమి

గీ॥ ఎన్నఁటికినైన నే వేల్పు • లేని, నేను నీకులేని దయాళులై • యీదురంత
విరహవారాశిలోనుండి • వెలికిఁదెచ్చి జీవితేశ్వరుపజ్జ నన్ • జేర్తురయ్య?॥

లక్ష్మ—తల్లీ! నీవంటి పతివ్రతామతల్లుల సంకల్పంబు లేనాఁటికైన సఫలములుగాకపోవు. దేవీ! నీకింక విన్నవింపవలసిన దేమున్నది?

ఉ॥ దాయలకైన రాఁదగని • దారుణమైన యవస్థ నీకు నె
ట్లో యనుభావ్యమయ్యె, నిఁక • నుమ్మలికం బిఁగమ్రింగి నీమనో

నాయకు రామచంద్రుని మ • నంబున నిల్పి దినంబు లెట్టులో
ద్రోయఁగదమ్మ, తాపస వ • ధూటులతోడఁ దదాశ్రమంబులన్॥

సీత — వత్సా! నీకు నాపైఁ గల భక్తివాత్సల్యముచే నిట్లాడితివిగాని
నాయనా! నేనిప్పుడున్న తెఱంగునకుఁ నా ప్రాణము లీ పంజర మొదల
వలసిన దినములు గలవు.

మ॥ కలకాలం బిటు చేసికొన్న పతికిం • గాకుండ నేకాకినై
యిల జీవించుట యెంతహైన్యమగు? న • న్నేరైన "నేలా మగం
డిలు వెళ్ళించె వచింపు"మన్న నపుడే • యీప్రాణముల్ పోవె? కాం
తలలోనం దలయెత్తి నే బ్రతుకఁజా • ల్నా యింతకుం బాత్రనై॥

వత్సా! దురంతమైన నాయీ వియోగదుఃఖమున కిన్నాళ్ళని పరిమితిలేదుగదా. హతాసురాలనై యొరుల పంచలంబడు నీచత్వమునకోర్చి యెవ్వరికొఱకై శరీరయాత్ర సాగింతును?

లక్ష్మ — తల్లీ! సకలధర్మ రహస్యంబుల మూలముట్టముగ నెఱింగిన
నీకెద్దియేని బోధించుట కేనంతవాఁడను కాని,

సీ॥ తనువు వైరోసి యుం • డని సాహసముఁ జేసి పతిని రాముని నిందఁ • బలుప కమ్మ
తాల్మిమై నెచటనో • తలదాఁచికొనియుండి కష్టకాలం బట్లె • గడుపు మమ్మ
ఏనాఁటికైన మా • కింతయాధారమౌ నీగర్భమేని మ • న్నింపు మమ్మ
పతియాజ్ఞ మున్నె చె • ప్పక నిన్ను వనికీడ్చు తెంపరిన్ నన్ను క్ష • మింపు మమ్మ
గీ॥ ఒదిగి భవితవ్యమునె నమ్మి • యుండుమమ్మ వేల్పులే నిన్ను విభుని క • ల్పింతురమ్మ
సెలవొసఁగుమమ్మ నన్ను రక్షింపుమమ్మ కడకు సీతమ్మ! యిదె నమ • స్కారమమ్మ॥

తల్లీ! నేనగ్రజుని పాదోపజీవినని యెఱుంగుదువు. ప్రాణాంతమగు సమయముననైన నేనుమాయన్నగారి యాజ్ఞనుల్లంఘించియెఱుంగను. కావుననే యింతటి ఘోరకార్యనిర్వహణమునకై యార్యపుత్రుఁడు నన్నే నియమించె. తదాజ్ఞానువర్తినై మీయెడ మహాపరాధముగావించితి. దుర్భరగర్భాలసవగు నిన్నేకాకినిఁగా నీకీకారణ్యమున డించి నేనొంటిగ

నింటికిఁబో సెలవగుచున్నాను. మన్నింపుము. తల్లీ! నాయెడఁ బుత్త్రవాత్సల్యము మఱవకుము.

(అని పాదములపైఁబడి నమస్కరించి దుఃఖించును)

సీత — (చేతులంటి) నాయనా! దుఃఖింపకుము. మనోవాక్కాయకర్మంబుల నీయందు నాకెంతమాత్రము కోపము లేదు. అట్టి జీవితేశ్వరుఁడే కాదు. పుత్త్రసమానుఁడగు నీయట్టి మఱందియు లభించుట చేతనే నిజముగా నాజన్మము పవిత్రమైనది. జన్మజన్మంబులకు శ్రీరామచంద్రుఁడే ప్రాణేశ్వరుండై లక్ష్మణుఁడే మఱంది యగుటకు నిత్యము వేయిదేవతలకు మ్రొక్కుచుండెద. నాయనా! నీవిఁక మరలిపొమ్ము.

సీ॥ కన్నీరుమున్నీరు • గానేడ్చి నీవు నా విధివిధానంబు ద • ప్పింతువయ్య
తడవైనచో మాట • వడుదు వింటికి నేగి మఱఁది లక్ష్మణ! నన్ను • మఱవకయ్య
ముగురత్తలకుఁ గేలు • మోడ్చితినని సీత కాఁపురంబడవిలోఁ గలసె ననుచు
విభునకు నామాట • నభివాదన మొనర్చి ప్రాణనాఁ దనచింత • బాయు మనుము
గీ॥ సడికినోడి తెగించి నకే • విడిచి మొదటఁ బిదప నాకయి తపియించు • విభునికంటెఁ
దొరఁగు కన్నీరు నీవైనఁ • దుడువుమయ్య బ్రతికితినయేనిఁ గాంతు శ్రీ • ప్పటికినైన॥

నాయనా! నే నదృష్టహీనురాలను. అటువంటి జీవితేశ్వరునితో భోగభాగ్యము లనుభవించునంతటి యదృష్టము విధి నా నొసట లిఖింపలేదు. అట్టిచిరదుఃఖినినైన నాకై నీవుగూడ నేల పరితాపము చెందెదవు. మహదైశ్వర్యములఁ దులతూఁగుచున్నను నార్యపుత్త్రుని జీవయాత్ర నామూలమున దుఃఖభాజనమైపోయెఁగదా. కరుణాస్వభావుండగు నార్యపుత్త్రుండు దుర్భరవియోగదుఃఖమున నేమైపోవునోయని దుఃఖించుచున్నానుగాని వత్సా! నాయవస్థకై నేనంతగాఁ జింతింపను. నేనెక్కడ నుండినను, నార్యపుత్త్రుని కుశలవార్తమాత్రము నాకుఁ దెలియుచుండినఁజాలు. ప్రాణేశ్వరుని క్షేమమే నా క్షేమము.

నాయనా! సౌమిత్రీ! నీవుమాత్రి మెట్టిసమయమునను నార్యపుత్రుని నొంటరిగా సంచరింపనీకుము. నిరంతరము మీ యన్నగారి సన్నిధినే కొలిచికొనియుండుము. చిరంజీవులయిన భరత శత్రుఘ్నులు గూడ నార్యపుత్రుని సేవావిధియం దేమరకుండునట్లు నామాటలుగా వచింపుము. నా చెలియండ్రు నాకొఱకై బెంగపెట్టుకొందురు. వారి నెట్లోయూరార్పుము. అయ్యో! మందభాగ్యురాలనగు నావలన నెందఱెందఱి కెంతటి సంతాపము సంభవించినదో చూడుము; తండ్రీ! ఇంతకంటె నేనెవ్వరి కేమివార్తలనంపుటకుం దగియున్నాను. ఇంతకు నాజీవితేశ్వరున కేమని సందేశమంపుదును వత్సా! సన్నిధికిం బొల్పుఱచి నందులకు నేను తనపైఁ గినుకవహించితినని యార్యపుత్రుఁడు తలంచునేమో, వారికి నిట్లనుము,

సీ॥ తనకు లోకాపవా ♦ దము మాసినఁ జాలు జీవమే నీయసం ♦ సిద్ధ మనుము
తనకంటె నాకు ని ♦ కఃపరంబేమి నాతన వాత్మ సర్వంబు ♦ తానె యనుము
తనయాజ్ఞఁ దలమోసి ♦ కొని తపోవనభూమి శీలమే నమ్మి వ ♦ సింతు ననుము
తనువులే దూరము ♦ లయ్యెనుగాని యాత్మలం దైక్యమిద్దానఁ జెం ♦ పయ్యె ననుము
గీ॥ విరహపరితప్తమయ్యు నా ♦ ప్రేమలతిక యశ్రుజలసేకమున వృద్ధి ♦ నందు ననుము
నిజమెఱిఁగి లోక మెపుడు మ ♦ న్నించు నపుడె మరల నన్నేలుకొనుట ధ ♦ ర్మంబయనుము

లక్ష్మణా! నాకు సంభవించిన యీదుర్భరవియోగమున నేను దుఃఖించుచునే యున్నచో నాకిక్కడ నెక్కుడుక్షణమైన సాగునా? నేను దుఃఖము పూర్ణముగా విడిచిపెట్టినాను. నాజీవితవిషయమై యార్యపుత్రుఁడు సంశయవిహ్వలుఁడుగాకుండ నావచనములుగా నిట్లనుము.

మ॥ లలితస్మేరకలావిలాసము, విసీ ♦ లభ్రూలతావిభ్రమం,
బలఘుప్రేమరసప్రసన్ననయనా ♦ జ్ఞాలోకనప్రోష, ము
జ్జ్వలతేజస్స్ఫురణంబు, శాంతరసభా ♦ వస్ఫూర్తి మీమూర్తి ని
స్తులితానందమునన్ భజంచుచుఁ దరిం ♦ తున్ జన్మమూ త్మేశ్వరా!॥

మ॥ కమనీయంబులు తావకీనగుణము • క్తారత్నముల్ ప్రేమ సూ
త్రమునన్ గుచ్చి, జపక్రమాకలనఁ జే • తఃపీఠి మీదివ్యరూ
పము సంధించి, నిరంతరానుభవ సే • వా భావనా పారవ
శ్యమునన్ బుచ్చెద జీవయాత్ర, రఘురా • మా! దీనచింతామణీ!॥

వత్సా! సౌమిత్రీ! పొమ్ము నేను భవితవ్యమును బ్రతీక్షించుచు నిచ్చటి తపోవనక్షేత్రంబులఁ గాలక్షేపముఁ జేసికొనుచుందు. నేను దుఃఖమును మఱవనే మఱచితిని.

లక్ష్మ—మేలు, పీరపతివ్రతాశిరోమణి! మేలు; ఇట్టి విషమస్థితియందు సహిత మేదోయొకధర్మనిర్ణయమునఁ గట్టుబడి చిత్తస్థైర్యము నిర్వహించుట ధీరమానసులగు పవిత్రతపస్వులకు మీకు సులభసాధ్యమై చెల్లుఁగాక, అయ్యో అల్పజ్ఞుఁడనైన నేనిట్టి ఘోరకర్మంబు చేతులారఁగావించి ప్రాణములభరింపఁగలనా, తల్లీ!

ఉ॥ 'నా' యనువారు లేని విజ • నంపు టరణ్యమునందు నిన్నుఁ ద
ల్లీ! యెటువిడిచిపోదుఁ బిరి, • కేగక యిచ్చట నీపదాబ్జముల్
పాయక సమ్మికొల్చి నిర • పాయముగా వసియింతమన్న నే
మో! యెటులాడునో జగ, మ•యో! యెటుఁబోయిన నేమిమూఁపునో॥

ఎట్లో మనసు రాయిచేసికొని నిన్నీయరణ్యమధ్యమున డించి పోయినమాత్రము నన్ను లోకము మన్నించునా?

మ॥ వికలత్వంబున రాముఁడింతపనికం • పెన్ జూడు, తానేమి యు
ర్భకుఁడా? దుర్భరగర్భభార, భయదా • రణ్యంబునన్ డించె, ఘా
తుకుఁ డాలక్ష్మణుఁడంచు నన్నుజనసం • దోహంబు నిందించు మా
టే; వేయేటికి నింక నే బ్రతుకు కం • టెన్ జచ్చుటే మెచ్చగున్॥

తల్లీ! అసమర్థుఁడనైన నే నాత్మహత్య చేసికొనవసినదే కాని నిన్నీ దురవస్థనుండి తప్పించు యోగ్యతకు నోఁచుకొన లేదు గదా! నామాట యటుండ అమ్మా! ఈసీ పరిభవోదంతము శ్రవణగోచర

మైన యుత్తరక్షణమున, నెంత వైరాగ్యవంతుఁడైనను నీతండ్రి జనక
క్షితీశ్వరుండు తన ప్రాణవాయువుల విసర్జింపకుండునా? అయ్యో!
ఎంతఘోర మెంతఘోరము నాతల్లీ! జానకీ దేవీ; లేక లేక నేఁటికి
నీగర్భమున రఘువంశ విస్తారకంబగు నింత యంకూరము చేకూరనున్న
దని యీవల మేమందఱమును, నావల నీపుట్టినింటి బాంధవులందఱు
నమందానందభరితులమై యెన్నియో కోరికల నువ్విళ్లూరుచుండ
నన్నిటికి హేతుభూతవైన నీవే కన్నుల యెదుట లేకుండ నీప్రచం
డారణ్యమున అయ్యో! పతిబంధువిదూరవై, నిర్గతికవై, నిరాధారవై,
'నా' యన్నవారు లేకుండ నల్లాడవలసి వచ్చెనే. అకటకటా; ఏకాకి
నివై యీ కీకారణ్యమున నెట్లు ప్రాణములు రక్షించుకొందువు? మిట్టాడ
నరుండు లేని యీనట్టడవిలో నిన్నురక్షింపుమని యెవ్వరికొప్పఁజెప్పి
పోవుదును? నారాయణా! దీనత్రాణపరాయణులైన కరుణామయు
లలో నొక్కరును దిక్కుమాలిన యీరామకుటుంబినిం గాపాడువారు
లేరుగదా! నావలెనే లోకమంతయు నిష్కరుణమై పోయెనా?
ప్రపంచమున విపన్నులైన సాధుజనములఁ బరిపాలింపఁజాలిన నిర్హే
తుకజాయమాన కరుణాలోకనస్వభావు లొక్కరును లేరా! ఓహో!
లోకరక్షాదిదృక్షాశాలురగు లోకపాలకులారా! మీలో నెవ్వరైన
నీక్షణమునఁబ్రత్యక్షమై యీరామక్షితీశ్వరునర్ధాంగిని రక్షింపలేరుగా!
హా నిరంతరాభ్యాగత సేవానిరతులైన యోతపోధనులారా! రామ
మయజీవిత, పరమపతివ్రతాశిరోరత్న, మీసీతామహాదేవిని మీరైనఁ
గాపాడలేరా! ఓహో!! సిద్ధవిద్యాధరయక్షగరుడగంధర్వులారా! మీ
రంద ఱేమూలలడాగియున్నారు? అయ్యో! ఎంతమొఱలిడినను నాయది
యరణ్యరోదనమైపోయెనే! నాయట్టిపాపాత్ముని మాట లెవ్వరాలిం
తురు కాని, పరమేశ్వరుని పరమాద్భుతసృష్టివిలాసమంతయు లోక
మున వెల్లడించుచు, ననేకజంతుసంతానములకుఁ గన్నతల్లివలెనున్న

యావనదేవతామతల్లికే యీనాతల్లి నొప్పఁజెప్పిపోయెదను. అమ్మా! వనదేవతా! నీవు సుగుణవల్లివి. అగ్రిమానసమున నామనవియాలింపుము. కాలకర్మవశంబున నీకడ నివసింపవచ్చిన యీయిల్లా లెవరనుకొంటివో,

సీ॥ జనకరాజర్షి పా • వనయజ్ఞవేదియం దవతారమందిన • యాదిలక్ష్మి
శివధనుర్భంగ ముం • కువగాఁగ శ్రీరాము పెండ్లియై కొన్న క • న్యాలలామ
కసిఁడికోఁతలకోర్చి • యసుగాధమునివీటఁ గులసతీత్వమునిల్పి • కొన్న సాధ్వి
తనవినిర్మలచరి • త్రము నగ్నికీలలఁ బ్రకటీకరించిన • భవ్యశీల
గీ॥ భగవతి యరుంధతీదేవి • ప్రస్తుతించు పోలఁతులవలంతి, వింశతిప్రా • ద్దులపడంతి
పతివియోగార్త, సీతఁ గా • పాడుమమ్మ భవ్యగుణవల్లి! వనదేవ • తామతల్లి!॥

తల్లీ వైదేహీ! పాపభూయిష్ఠుఁడగు నాజన్మమున కెయ్యది ఫలమో యయ్యది నెఱవేర్చితిని. సెలవుఁగైకొని పోయెదను. పరమపావనములైన నీచరణారవిందములఁ గడసారి నాశిరంబునఁ జేర్చుకొననిమ్ము అమ్మా! నాజన్మమున కింకెక్కడఁ బుణ్యావకాశము లేదుగదా.

(అని నమస్కరించును).

సీత—నాయనా! పోయెదవా! నిన్నుఁజూచుచున్నవరకు నాకుదుఃఖము కుదుటఁబడదు కాన నీవు శీఘ్రముగఁబొమ్ము

లక్ష్మ—తల్లీ! పోవుచున్నాను. (కొంతదూరముపోయి మరలవచ్చి సీత పాదములపైఁబడి) అయ్యో! ఎంతయని తెంపువహించెదను. ఇంతలో నెవ్వరేని నీరక్షణకు నేతెత్తురేని కొంతసంతసముతో నింటికిఁ జేరుదునే. ప్రొద్దుబొత్తుగాఁ గ్రుంకిపోవుచున్నది. నిబిడతరుచ్ఛాయాసముదాయముచే నీయరణ్యము మఱింతకాఱుచీఁకటుల కాకరమై భయజనకముగ నుండునే ఎట్లుపోవుదును. కాలెట్లాడును? తల్లీ!

సీత—లక్ష్మణా! నీవు మరల నాకు దుఃఖమును గలిగించుచున్నావు. నీవు పొమ్ము నాకెవ్వరివలన నేభయము లేదు. వత్సా! నీకు వెట్టి

గాని నాయట్టిమందభాగ్యురాలికి సులభముగ మృత్యువు సంభవింపఁగలదటోయీ ?

లక్ష్మ — తల్లీ! అట్లుగాదు నీపతివ్రతాత్వతేజోవిభ్రాజితవగు నిన్నుఁ జేరి చూడ నెవ్వరికి సాధ్యము! ఈ యరణ్యమునందైన నేమి నీకు సాయపడని వారెవ్వరు ?

సీ॥ నాగాంగనలు మణి • భోగాతపత్రంబు లెండ వేళల నుద్వ ♦ హింత్రు గాత
లీలాకురంగ బా ♦ లికలపోలికఁ గ్రోలుపులులు మాలిమితోడ ♦ మెలఁగుఁ గాత
తటియొటంగి, తమంతఁ ♦ దరులు వాచవులూరు వివిధఫలంబు ల ♦ ర్పించుఁ గాత
విపినదేవత లూడి • గపు సానులై రేయి జోకొట్టి నిదురఁ బు • చ్చుదురు గాత
గీ॥ ఎచటనుండినఁ గాని వా ♦ రెవరు నీకు, కాలములు పంచభూతముల్ • గ్రహచయంబు
వేదములు నిన్నియేల నీ ♦ విమలమైన యాత్మశుద్ధియె నీకు వ ♦ ర్తింగజోడు॥

కావున నిర్భయముగా నింకఁ బురికేగెదను. తల్లీ! ఇవే పునః పునః ప్రణామములు. (అని పోవుచు) ఓహో! సకలధర్మాధర్మనిర్ణయాధికారధౌరేయులై లోకత్రయీశాసన ప్రక్రియా ధురంధరులై ప్రకాశించు నోలోకపాలకులారా! చరాచరవిశిష్టంబగు నాపరమేష్ఠి సృష్టి ప్రపంచంబునంజరుగు కర్మసంఘాతమునకెల్ల సాక్షిభూతులరై యుండు నోసూర్యచంద్రులారా! యమనియమాద్యష్టాంగ యోగానుష్ఠాన సిద్ధులై కేవలధర్మసంస్థాపనార్థమై కారణశరీరముల నవతరించిన యోతపోధనసత్తములారా! ఓతల్లీ! రఘుకులదేవతా భాగీరథీ! నన్నుఁ బరిపాలించు ప్రభూత్తముఁడును విశేషించి నాకు నగ్రజాతుండును నగు శ్రీరామచంద్రధరణీంద్రునాజ్ఞాబలమున నేఁ బరిణతగర్భభరోపేతను, అయోనిజాతను, భువనత్రయ ద్యోతమాన పతివ్రతాత్వ తేజోవిఖ్యాతను, లోకమాతను, నీసీత, నీ యరణ్యభూముల విడిచిపోవుచున్నాను. మనోవాక్కాయ కర్మంబుల నే నిందేయపరాధ మెఱుంగను. నాభావపరిశుద్ధింబరీక్షించి మీరందఱునాకు సాక్షిభూతులరై యుండి యిహపరంబుల నన్ను శిక్షాపాత్రిని జేయక రక్షింపుఁడు.

(అని పోవుచుండఁ దెరలో)

అయ్యో, దండాయనా! ఈప్రాంతమునుండి దీనారవము శ్రవణగోచరమగుచున్నది. పోయి కనుఁగొందము రమ్ము.

సాధ—అవును. ఎవరైన నభ్యాగతులు వచ్చిరేమో చూచి గురుపుత్రులగు వాల్మీకులవారికిఁ జెప్పుదమురా.

లక్ష్మ—(ఆకర్ణించి) ఓహో! ఇది భగవానుఁడగు ప్రాచేతసుని యాశ్రమోపాంతమే. హృదయమా! ఇప్పుడు నీవు నిశ్చయముగా నుండుము. నేనింకఁ బోవచ్చును. (నిష్క్రమించును.)

సీత—అక్కటా! పుణ్యమూర్తి యా లక్ష్మణుఁ డేగుచున్నాఁడుగదా? నాయవస్థయంతయుఁ జూచి నాతని దైన్యస్థితిఁ జూచి క్షిరికించిన నాకు దుఃఖ మినుమడించుచున్నదే! అయ్యో! ఎంతటి కరుణాసముద్రుఁడు, ఎంతటి భ్రాతృసేవాతత్పరుఁడీ లక్ష్మణుఁడు.

సీ॥ కనుఁగవ నిండ నూ • మునితెంతబాష్పములెల్లెడిఁ జిప్పిల నప్ప • లించుకొనుచు
నా వెసఁ భయము, దై • న్యము, విస్మయము, జాలి దేలుచూపుల వెక్కు • రిరిగికనుచు
ననుఁబోవు దీనబాం • ధవులకై యాసతోఁ బలుమారు దెసల వీ • క్షించిఁగనుచు
కనఁజూపుమేర ద • ప్పిన వెన్కకే తెంచి మరలుమ వచ్చు ను • మరలఁజనుచు

గీ॥ చిత్తమేలాగొ రాయిచే • సికొని తనదు ప్రాణముల నాపదంబుల • రక్షగట్టి
పురికిఁ బోలేక పోలేక • బొందితోడఁ బోవుచున్నాఁడు సౌమిత్రి • పుణ్యమూర్తి।

ఇప్పటికాతని దివ్యమూర్తి నాకన్నులకుఁ జాటైపోయినది. ఈపాటికి గంగ కవ్వలిదరికి జేరియుండును. అతనితో నేనేమో ధైర్యవచనములాడితిఁగాని యొంటరినై యెక్కడికేగుటకు నాకిపుడు ధైర్యమాగుటలేదు. (వినుట నభినయించి) ఈవంకనుండి మాటలు వినవచ్చుచున్నవి.

(పిమ్మట వాల్మీకి శిష్యద్వయముతోఁ బ్రవేశించును)

సాధాతకి—గురూత్తమా! ఈయమ యేకాంబోలు నింతకుఁ బూర్వమేడ్చుచున్న దీనురాలు.

వాల్మీ—వత్సా! సాధాతకీ! ఈయమయెవరో నే నెఱుంగుదును, (అని సీతనుసమీపించి) వత్సా! జానకీ! ఊఱడిల్లుము,

సౌధా—(స్వగతము) జానకియనుచున్నారు. ఈయమ శ్రీరామ చంద్రుని దేవేరియా యేమి !

సీత—తాపసోత్తమా ! అభివాదనము. (నమస్కరించి) భగవానుఁడా ! ఆర్తనైయున్న నన్ను రక్షింపవచ్చిన దివ్యర్షులు తామెవ్వరో నే నెఱుఁగవచ్చునా ?

వాల్మీ—తల్లీ ! నీవు నన్నెఱుఁగవుకాని నేను నిన్నెఱుఁగుదును.

మ॥ విను వాల్మీకి యటంచురమ్మ నను; నీ వృత్తాంతముల్ యోగదృ
ష్టి నెఱుంగంబడె, మాకు నీవిభునకున్ స్నేహం బనల్పంబు, నీ
జనకుండున్ బరమాప్తుఁ, డాదశరథ క్ష్మాభర్తయున్ మేమెఱిం
గినవాఁడే, దిగులొందకమ్మ యనురక్తిన్ నిన్ను రక్షించితిన్॥

సీత—తండ్రీ ! పొరపడితిని. పురాణబ్రహ్మవాదులకు ప్రాచేతసుల మిమ్ము నేనుమాత్ర మెఱుఁగకేమి ? శోకమూర్ఛావివశత్వమున మతిమాలి మీయెడ నపచార మొనరించితి, క్షమింపుఁడు.

వాల్మీ—కుమారీ ! యపచారమేమి నాబిడ్డవేకదా నీవు ?

చ॥ మన మునిపల్లె యీతరుల మాటుననే యొకకూఁత వేటుదా
పునఁగల, దర్ఘ్యముల్ గొనుము పోవుద, మచ్చట మాతపస్వినీ
జన మరచేతఁ గన్నులిడి సాకుదు, రీయది నీ గృహంబు, నీ
యనుచరదాసికాసముద యంబులు సంయమిబాలికామణుల్॥

సీత—తండ్రీ ! ఇట్టి కష్టకాలమున మాపంచకు రమ్మని నన్నాదరించు నాప్తబంధువులు మీకంటె నాకెవ్వరును లేరు, కాని

చ॥ ననుభరియింపఁ గష్ట, మొక నాఁటిదిగాదిది నాకు; నెన్నినా
ళ్ళని మిమువంటి బంధుల గృ హంబులలోఁ దలదాఁచికొందుఁ, గా
దనివచియింపఁ గాని జన కా ! కలకాలము మీకుభారమై
దినములఁద్రోయఁగా ననుమ తింతు నె యీఁకొఱగాని మేనితోన్?॥

వాల్మీ—బిడ్డా, యెంతమాటాడితివి! నీవంటి పతివ్రతామతల్లుల సత్కరించుటకంటె మాతపంబులకు ఫలంబు లితరములుగలవా? అద్ది

గాక మేము నిమిత్తమాత్రులమే కాని మా యాశ్రమవనీతలంబే నీయట్టివారి నెందఱినో భరింపఁగలదు. కావున నే,

చ॥ తపస్వులనుండి శిష్యసము ♦ దాయముతో నివసింతుమిందు, నె
న్నఁడు తనుయాత్రకై కఱవు ♦ నంబడ, మావని వేల్పుటావుకై
వడి భరియించు మమ్మతిథి ♦ వర్గము, నెందఱికైన లేదనన్
గడ కిట మాకుటీరహరి ♦ ణంబులకైనను లేదు మానినీ! ॥

జానకీ! వేయేల? యీపరిసరవనీతలంబంతయుఁ జిరకాలము నుండి యథేచ్ఛగా మేము పరిపాలించుచున్నారము. మీరాజులకున్న ప్రాభవమంతయు మాకును లేకపోలేదు వినుము,

సీ॥ గంగాపగాతరంగములఁ దోఁగిన శీతవాతాంకురములు సే ♦ వకులు మాకు
హవనధూమపయోద ♦ సమితిఁ గాంచి నటించు నలమయూరములు గా ♦ యకులు మాకు
అరివర్గమున కసా ♦ ధ్యములైన పావనాశ్రమములు కొల్వుకూ ♦ టములు మాకు
ఫలసమిద్వల్కలా ♦ దులఁ గానుకలొసంగు తరులు సామంత సం ♦ తతులు మాకు
గీ॥ నాటకరయె పండు నివరిధా ♦ న్యములపంట, ఆలమందలపాడి భో ♦ గ్యంబు మాకు
పావనంబైన స్వచ్ఛంద ♦ జీవనంబు అవనిపుల కింతకంటె సౌ ♦ ఖ్యంబు గలదె? ॥

సీత—జనకా, ఇచ్చటనాకు సౌఖ్యలోపముజరుగునని నేనెంతమాత్రముఁ దలంపను గాని, అక్కడిమునిపత్నులొకప్పుడు "జానకీ! నిజముచెప్పుము నీప్రాణేశ్వరుఁ డేల నిన్ను విడనాడవలసివచ్చె" అని నన్నడిగినచో వారికేమని సమాధానము చెప్పఁగలను. నా మనోనాథుని కరుణాస్వభావము వారెఱింగినవారగుటచే జరిగినవాస్తవ మిదియని చెప్పినను విశ్వసింపరు. నాయందేదియో మహాపరాధమున్నదనియే తలంతురు. నేను నిరపరాధనని నా యంతరాత్మ యెఱుంగును. దైవ మెఱుంగును. ఆర్యపుత్రుఁడు గూడ నెఱుంగకపోలేడు. ఏనాఁటికేమో వంశచ్ఛేదమొనరించి భ్రూణహత్యాపాతకముగూడ నేలకట్టుకొనవలయునని యింత వఱకతిభారముగా నీపాడుశరీరము మోయుచున్నానుగాని

నాయనా! లేకున్న నీవటకే యీగంగలో మునింగియుండనా? తండ్రీ! అటువంటి జీవితేశ్వరు నెడఁబాసి యింకను మొండినై జీవింపవలెనా?

చ॥ అంతటికాఁపురంబునకు ♦ నాఁడిదియై, సడిమోసి, మానిసు
ధ్ధాంతముపొంతకేఁ దగుసు ♦ నంచెటుపోవుదు; నీవనాంతమం
దంతటిదాననై రఘుకు ♦ లాంకురు మేర్పడు నంతదాక నీ
వంతభరించి, యంత బల ♦ వంతముమై తరియింతు జన్మమున్॥

వాల్మీ—బిడ్డా! నీవు కంటనీరిడిన నేఁ జూడఁ జాలను — దుఃఖింపకు — ఈ నిందకుంగల కారణార్థము వేఱు

ఉ॥ పుట్టువుతోడనే పరమ ♦ పుణ్యవు నీవయి నేఁటికెట్లొ యీ
పుట్టిననింద యేసరిత ♦ మున్ భావరింపఁగ లేదుగాని నా,
పుట్టువుమంచిదై, జనక ♦ భూపతిపోలిక, నిన్ను నేను నా
పట్టిగనెంచి, పెంచికొను ♦ భాగ్యము నాకు ఘటించె జానకీ!॥

తల్లీ! నీపాతివ్రత్య మెఱుంగనివారు లేరు. నిన్నెవ్వరో శంకింతురను భయ మక్కఱలేదు. నీయుపచారమునకై నేను నియమించు నొకరిరువురు దివ్యపురంధ్రులకుఁ దక్క నన్యులకు నీ వదృశ్యవైయుండునట్లు నీకు వరమిచ్చితిని గమ్మా.

సీత—తండ్రీ! ఇంక నిర్భయముగ నీకడుపున దాఁగియుండెదను.

వాల్మీ—బిడ్డా! నీవు పెఱచోటికెక్కడికో రాలేదు రమ్మ నీపుట్టినింటికే; పరమేశ్వరుఁడు నిన్నుఁ జేర్పవలసిన చోటికే చేర్చినాఁడు.

ఉ॥ ఈ మునిపల్లెయే మిథుల, ♦ యే జనకుండఁ, దపస్వినీజనం
బే మదినమ్ము బాంధవ, మిఁ ♦ కేటికొఱంత, పక్షంతు లెందురా
రా మునుగానుపుంబుడిటి ♦ కై, తమ పుట్టినయిండ్లకున్? కుమా
రీ! మిథిలేశ్వరుండొకఁడు ♦ నేనొకఁడా? నినుఁగూర్చిఁ బెంపఁగన్॥

సీత—నాయనా! అట్లన్నఁడుఁ దలంపను. ఆ జనకుఁడు నన్ను నాసంతోషకాలమునఁ బెంచెను. నీవో నాయాపత్కాలమునఁ గడుపున నిడికొని పెంచఁ గొనవనున్నావు. ఆజనకునికన్న నీజనకుఁడే నాకు మిన్నయనుకొన్నను దోషముగాదు.

వాల్మీ — బిడ్డా! అతఁడు జగదేకపూజ్యుఁడు కడుపునఁ గనకున్నను జగదీశ్వరి వగు నీయట్టికూఁతునకుఁ దండ్రియై సార్థకనామధేయుఁడయ్యె! నేఁటికి నాతపము సఫలమై నాకులభించితివి. కాని, యతఁడు రాజాధిరాజు. నేనో యడవికాఁపరినగు తాపసుఁడను. అంతఃపురభోగభాగ్యములతోఁ బెంపలేనుగాని జీవయాత్రకు లోపముండదు.

సీ॥ కఁడమాన్నముం బెట్టఁ ♦ గఁనో లేనో కాని వెదురుబియ్యమున కే ♦ కొదవలేదు
మేటిపక్వాన్నరంపు ♦ మాట యేమో కాని కందమూలములకే ♦ కఱవులేదు
కలధౌతమణిసౌధ ♦ ములు గల్గవే కాని పర్ణశాలలకు లో ♦ పంబులేదు
జిలుఁగు మేలిమి పట్టు ♦ చీర లేమో కాని వల్కలంబుల కేమి ♦ బ్రాంతిలేదు
గీ॥ పడకకై దూఁదిపాన్పులె ♦ క్కడివిగాని పూరిసెజ్జలు వెండి బం ♦ గారుగావు
పెట్టిపోఁతల కొకపేరఁ ♦ జేదనైనఁ గరణకును నాకుఁ జేదఱి ♦ కంబులేదు॥

తల్లీ! రమ్ము ఇప్పటి నీయవస్థకుం దగిన జీవనమునకు నాపెంపు దగియే యున్నది.

సీత — నీయాదరణము నన్ను దుఃఖము మఱపించినది.

వాల్మీ — బిడ్డా! కన్నులు తుడిచికొని, దారిచూచి నడువుము. సందెచీఁకటిగూడను. (అంధులు నడుచుచున్నారు.) అమ్మా! ఇక్కడ హెచ్చరిక.

సీ॥ పునుఁగు దట్టముగాఁ బే ♦ రిన రాలు కాల్జాఱు; పూనికమై తీవ ♦ లానుచమ్మ
సెలయేటిజాలు నిం ♦ చిన యూబులిచ్చోట నవ్వురుమబ్బుల నడ ♦ యాడుమమ్మ
కుశసూచికంటకాం ♦ కురపథ బిడి కాలిసడజాడలను మెల్ల ♦ నడువుమమ్మ
సేలమిడికిఁ జాల ♦ వ్రాలె నీతరుశాఖ తలవాంచి, మెలపునఁ ♦ దొలఁగుమమ్మ
గీ॥ అల్లదే పవయాశ్రమం, ♦ బాలమంద రొప్పకొనవచ్చు బ్రహ్మచా ♦ రులును వారె,
అలరి నారాక లోనికిం ♦ దెలుపనేమొ హరిణకంబిదె రివ్వునఁ ♦ బరుగవారె॥

(అందఱు నిష్క్రమింతురు)

ద్వితీయాంకము
సంపూర్ణము.



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# ఉత్తర రాఘవము.

## తృతీయాంకము.

(లక్ష్మణుఁడును జనార్దనభట్టును బ్రవేశించి యుందురు.)

లక్ష్మ—నాకు మొదటనుండియు నిదియే నమ్మకము.

జనా—ఇంక సందేహమేఁకులకు ? వయసుకూడ మీయూహకు సరిపోయినది.

లక్ష్మ—ఎన్నియేండ్లుండును ?

జనా—పండ్రెండేండ్లకు మించ లేదు.

లక్ష్మ—సరిపోయినది. దేవిగారిని విడిచివచ్చి పండ్రెండేండ్లే యైనది. ఉపనయన మైనదా ?

జనా—చెప్పితినిగా క్షాత్రకల్పమున నైనదని.

లక్ష్మ—అవును. మఱచిపోయితిని. ఈయమితోత్సాహముతో నాకు మతి తిరుగుచున్నదిసుమా కాని, జనార్దనభట్టూ! బాలురక్కడనేయుండి జానకీదేవిమాత్రము లేకుండుటేమి ? వారు సీతాతనూభవులు కాకుందురా?

జనా.—కాకున్న నాక్షాత్రతేజమునకును ఆధనుర్వేదవైశద్యమునకును నేమందువు?

లక్ష్మ—వీరు పరశురామునివంటి యపూర్వ బ్రహ్మసంతానమేమో?

జనా—అట్లయిన సీతారాముల ప్రతిబింబము లగుటెట్లు ?

లక్ష్మ—అప్పటికి సీతయేమైయుండును! భర్తృవియోగసంతాపమున ...

జనా—బాబూ! వాల్మీకి భగవానుఁడుండఁగా నంతపని జరుగనిచ్చునా?

లక్ష్మ—అదియు విచార్యమే. పత్యాజ్ఞలేకయే జానకియంతటి పతివ్రతా తిలకం బాత్మహత్యఁ గావించుకొనునా? అదియుంగాక నిరంతరము, నిజహృదయాంభోరుహ కర్ణికాపీఠమున సుప్రతిష్ఠించుకొని నిర్భరప్రేమ సూత్రమునఁ గూర్పఁబడిన శ్రీరామగుణముక్తారత్నములతో జపధ్యానపారవశ్యమున జీవించియుందునని చెప్పిన దేవి తన వాక్సత్యమును తప్పదు. అట్లు తలంచుట పాపాతిపాపము కాని! జనార్దనభట్టూ! మాజానకీదేవిని రఘుకుల ధురంధరులైన పుత్రులతో మరల మారామచంద్రునకొప్పగించు భాగ్యమీమంద భాగ్యనకు లభించునా?

జనా—నాయనా! నిరుత్సాహమేల. నిజముగా నేదేని దుర్యోగమే సంభవింప నుండినచో నీయాశాంకురములకే యవకాశము లేకుండును. ఇంతలో నీతొందరయేల? నేఁడువచ్చునుగదా నారాయణభట్టు.

(నారాయణభట్టు ప్రవేశించి) చిరంజీవికి జయము జయము.

లక్ష్మ—ఏమైనది?

నారా—చూచివచ్చితిని.

లక్ష్మ—ఎవరిని దేవిగారినేకదా?

నారా—కాదు, దేవీసంతానమును.

లక్ష్మ—అయ్యో, జానకీదేవి లేనేలేదా?

నారా—ఉన్నది.

లక్ష్మ—ఎక్కడ?

నారా—ఎక్కడనున్నదో చెప్పలేదు.

లక్ష్మ—ఎవరు చెప్పలేదు?

నారా—భగవానుఁడు వాల్మీకి.

లక్ష్మ—నీ వా మహామహునితో మాట్లాడితివా?

నారా—ఆ ఘనుఁడే నాతో మాట్లాడినాఁడు.

లక్ష్మ—నీవు మాచేఁ బంపఁబడినవాఁడవని యాయన కనుంగొనెనా యేమి?

నారా—ఆర్ష చక్షుస్సునకు కష్టమేమున్నది? మన మింతకాలమునుండియుఁ జేయుచుండిన రహస్యపు వేఁగంతయు నాయన పూసగ్రుచ్చినట్లు చెప్పివేసినాఁడు. సీత బ్రతికియే యున్నదఁట.

లక్ష్మ—అమ్మా బ్రతికితిని!

నారా—బయలుపడవలసిన యవసరమువచ్చినప్పుడామెయే బయలు పడునని చెప్పుచు నీకు రహస్యముగఁ జెప్పుమనిన సందేశమిది. 'వత్సా' లక్ష్మణా! సీతారామ పునస్సంయోగమందలి నీదృశ ప్రయత్నము సఫలముకాఁగలదు. మనరామునిచే రాష్ట్రీయ పౌరజానపద సమావేశహేతుకమగు నేదేని మహాయాగ మొకటి ప్రారంభింపఁజేయుము. పిదపఁ గాఁదగినది దైవమే యనుసంధించుఁగాక'. అని

లక్ష్మ—విప్రోత్తమా! దైవ మిట్లనుకూలింపవలయు. లోకాతిశాయి ప్రభావులైన మహామహులకేమేని విపాకము సంభవించినను దన్నిర్వాపణమునకు దైవమెన్నని యలౌకిక సాహాయ్యకముల ననుసంధించుచుందురు. కాని, సంపూర్ణ వైరాగ్యముచే నేఁడో రేపో తపోవనగమనోన్ముఖులై యున్న మాయన్నగారిచే యాగము చేయించుటెట్లు!

జనా—ఎట్లో; కార్యజ్ఞునకు నీకు దుర్ఘటమేమున్నది?

లక్ష్మ—సరే విచారించెద. ఈ యాలోచనలంబడి రాముని నేమరియుంటిని గదా!

జనా—ఆలాగైన మహారాజగారు నీకై నిరీక్షించుచుందురు. పొమ్ము.

( నారాయణభట్టుతో నిష్క్రమించును )

లక్ష్మ— (పరిక్రమించి, రాముని మందిరము ప్రవేశించును)

( రాముఁడును, భరతుఁడును గూర్చుండి యుందురు. )

రాము—తమ్ముఁడా, భరతా ! చిరంజీవి లక్ష్మణుఁ డింకను రాకున్నాఁడేమి ?

లక్ష్మ—ఇదిగో వచ్చితి జయము జయము ఆర్యునకు ;

రాము—వత్సా ! ప్రయాణసన్నాహము చేయించితివా ?

లక్ష్మ—సన్నాహ మెంతలోఁ గాఁగలదు నిశ్చయమైనచో.

రాము—ఇంకను "నిశ్చయమైనచో" అనుచున్నావేమి ? దురంతమగు చింతాభరముతోఁబాటీరాజ్యభరముగూడ నింకెంతకాలము వహింతును? పర్యాకులవ్యగ్రములగు చిత్తవృత్తులచే రాజ్యకార్యముల నిర్వహించుట యెన్నియసర్థములకో మూలము.

చం॥ తన పరిపాలనం బనవ ♦ ధానతఁ జెందినచోఁ బ్రజానురం
జనము నశించు, దాస నయ ♦ శంబు కొలంబున కెల్లఁ బ్రాఁకుఁ ద
జ్జనపతియుం దురంతకలు ♦ షంబున నిందుననందు నింద్యుఁడై
చను, నటుగాన నట్టి దురిత ♦ సంతతినుండి తొలంగఁ జేయనై॥

భర—ఆర్యా ! స్వధర్మనిర్వహణమునందు మీకుఁగల యత్యంతాసక్తిచే నెక్కడ నేధర్మచ్యుతి సంభవించునో యని యనునిమేషము మీరు సంశయించుచుందురుగాని, శోకవిహ్వలులై రాజకార్యములందు విముఖులై యున్నారని మిమ్మెవ్వరు ననుకొనుట లేదు. ఎవ్వరి నోట విన్నను,

ఉ॥ పామరులన్న కొండొకప్ర ♦ వాదముపైఁ దనప్రాణమైన సా
ధ్వీమణిఁ గానలోఁ ద్రుణగ ♦ తిన్ విడనాడి మనంబు మోహాచిం

తామలినంబుసేయక, య ♦ థావిధి రాజ్యము నిర్వహించు వి
ద్యామహిమంబు రాఘవ వ ♦ తంసున కే తగునండ్రు భూజనుల్॥

రాము—వీని కేమి ? ప్రజాభిప్రాయములు క్షణక్షణము మాఱుచుం డును. ఇదిగాక లోకమంతయు నేకాభిప్రాయనిరూఢమై యుం డుట యసంభవముగదా,

చం॥ "ఒడలు పశంబుగాక యెవఁ ♦ డో యొకఁ డాడిన నిందకోడి, రా ముఁడు నడికానఁ బోవిడిచెఁ ♦ బో తనయాలిని, నంతనే సడిౕ గడచెనె? మాటకై, కనుది ♦ నంబుల వ్రేఁకటిదాని నెంత్రము క్కఁడి పెనురక్కసుండయినఁ ♦ గాని కటా! యిటుసేయునే సతిౕ"॥ ఇట్లనువారుగూడ లేకపోరు.

లక్ష్మ—ఈమాట నాఁడే విన్నవింపనెంచితినిగాని యప్పటి మీకార్య నిశ్చయము నన్ను నోఱుమూయించినది. కానిండు. ఎవరె ట్లాడిన నేమి ?

శా॥ లోకారాధ్యులఁ బుణ్యదంపతుల సు ♦ శ్లోకాఢ్యులౕ మి మ్మెవం డో కింపాకుఁడొకండు మైమఱచి, కూ ♦ యుంజూడుఁ డీమాత్రనే లోకోద్దీపకమైన మీచరిత కే ♦ లోపంబు, దేశప్రజా నీకం బేకత మీమనం బెఱుఁగకు ♦ న్నే యింత కాలానకుౕ॥

రాము—సోదరులారా ! సీతాపరిత్యాగమందలి పరమార్థమును లోక మేకాలమునకైన నెఱుంగుఁగాక. నాకిప్పుడు కావలసిన దేమ న్నది. నేను తపోవనగమనమునందుఁ గృతనిశ్చయుఁడనై యున్నాఁ డను. రాజకవచము దొడిగియున్నంతవఱకే కదా నాకు లోకానుసరణము. నాయనా! భరతా, ఈరాజ్యభర మింక నీవు వహింపఁదగినదే. నేఁడే నన్నుఁ బంపివేయుము.

భరత—ఆర్యా ! నేఁటికైన నీభరతుఁడు మీచరణదాస్యమునకుం బనికిరాఁడా ? అయ్యో, ఎంతపాపకర్ముఁడను;

శా॥ మీరుంగూడని తండ్రియానతిమెయిన్ ♦ మి మ్మాయరణ్యంబులన్
జేరంబంపి, చతుర్దశాబ్దముల నే ♦ న్నే బ్రహ్మకల్పంబుల
ట్లారాధించుచు నీదుపాదుకల, రా ♦ జ్యం బేలితింగాని, య
న్నా! రాకాసినె మీరువీడిన యయో ♦ ధ్యన్ నేను గాలూనంగన్॥

నాఁడు సౌమిత్రి కనుగ్రహించిన మీసాహచర్యభాగ్యము నేఁడునా కనుగ్రహింపఁగూడదా? మీరిప్పుడు తపోవనమునకుఁ బోవుటయే తగదు. కాదని పోవుటయే నిశ్చయించితిరా చిరంజీవి సౌమిత్రికి రాజ్యమొప్పగించి నన్ను మీ వెంటఁ గొనిపొండు.

లక్ష్మ— అట్లెన్నఁడుం జరుగదు; మేమందఱము మీకోడివారమే. ఈవియోగావస్థయందు నార్యపుత్రు నొంటిగా విడిచియుండనలదని పూజ్యురాలగు వదినె నాకానతిచ్చిన సందేశము వినుండు.

శా॥ 'ఏ నెందున్నను రాఘవేంద్రుచరణం ♦ బే దిక్కుగానుందు, వ
త్సా! నీవేమఱ కెల్లకాలము తదీ ♦ యచ్ఛాయయుం బాయ క
య్యా! నామాటుగ' నంచు మావదినె మి ♦ మ్మర్పించె నాకెన్నియో
యానల్ వెట్టి తదాజ్ఞమీఱని వని కె ♦ ట్లంపింతు మిమ్మొంటిమై॥

రాము— అయ్యో! సౌమిత్రీ! ఇంకను మీవదినె యెక్కడ ?

శా॥ ప్రారబ్ధంబగు దుష్ప్రవాద పరిభా ♦ వంబోర్చి యున్నాళ్ళు ఘో
రారణ్యంబులయం దనాథగతి వ ♦ త్సా! సీత జీవించునా?
పారంబందని యీవియోగపరితా ♦ పగ్లాని కామ్లానమై
జారున్ జీవలతాంత మింతవర కా ♦ శావృంతనిష్క్రాంతమై॥

లక్ష్మ—ఆర్యపుత్రా! అట్టి నిరాశ కవకాశము లేదు. మావదినె బ్రతికియే యున్నది. నిరంతరము పతినామమాతృకజపధ్యానానుసంధానముతోఁ దపోవనక్షేత్రములయందు శుభకాలమును బ్రతీక్షించుచుఁ గాలక్షేపము చేసికొనుచుందు నని కథావక్కాణించినది.

రాము—ఎంతయమాయికుఁడవు సౌమిత్రీ! ఈమందభాగ్యులకు శుభకాలముగూడనా? జీర్ణకాంతారమైనది నాసంసారము. అందు దుస్సహ యాతనాపోత మగునాతనువు కాలముతోఁబాటు నడుచుచునేయున్నది. మఱిశుభమనుమాట యేలోకములోనిదో చూడు,

చ॥ క్రిమముగ సీతఁబాసిన జ ♦ గంబునఁ గాలహృతంబులై వసం
తములు గతించె, శారద సు ♦ ధామధురస్ఫురదిందుచంద్రికా
గమములు నిర్గమించె, సువి ♦ కస్వర ధీరమయూరగీతికా
హములు గతించె నెన్నియొ క ♦ టా; గతియింపవు రాముజీవముల్॥

భరత—ఆర్యా! ధీరతవాటింపుఁడు. ఈపరితాపమునకు మేరయెక్కడిది?

చ॥ గడచినదానికై వగవఁ ♦ గా ఫలమెయ్యది? దైవికంబులన్
గడవఁదరంబె కెల్ల యెడఁ ♦ గాని సుఖంబులయందుఁగాని, యె
న్నఁడును మనోవికారచల ♦ నంబు లెఱుంగని మీరె యింతగా
నడలిన మమ్ముబోఁటి యక్ర ♦ తాత్ముల కెక్కడివయ్య ధైర్యముల్॥

రాము—సహోదరులారా! ఇంకను ధైర్యమనుచున్నారా? అంతర్లీనమై రగులుచున్న దుఃఖానలముతో నగ్నిపర్వతమువలె లోలోఁగాలుచున్నను బైకిగాంభీర్యమే నటించుచున్నాను. ఇది నానాఁటికి దుర్భరమగుచున్నది.

శా॥ గాయం బేమియుఁగానరాక విపది ♦ గ్ధంబైన శస్త్రంబుగా,
నాయంబుల్ దెగఁగోయుచున్నయది; వ ♦ త్సా! యెన్నఁడీయాతనా
వ్యాయామంబున కంతమో మది నిరా ♦ శాశ్వాసితంబయ్యె నె
ట్లో యంతర్దహనంబునన్ గుములు చుం ♦ డున్ బూదిగా దింతకున్॥

నేఁడు నా ప్రాణబంధువుల మిమ్మందఱ విడనాడి తపోవనమున కేగుచున్నాఁడఁగాన హృదయము నవశమై సంక్షోభించి శోకము వెల్లివిరిసినది.

లక్ష్మ—ఆర్యా! ఇట్టియవస్థలో రాజధానియం దుండిననే కొంత యూరట కవకాశముండును; కాదా,

గీ॥ నిరతజగదభ్యుదయకార్య • నియతిఁజేసి
చిత్త మంతగ శోకవం • చితముగాఁగ,
కార్యగతి లేక శోకమే • గతిగ, నేక
తమున వనినుంట కడుఁ బ్రమా • దంబుగాదె॥

రాము—నాయనా! ఇక్కడమాత్రము నాకు శాంతి యెక్కడిది? జానకీచిరసహవాసచిహ్నితములైన యీమందిరస్థానవిశేషములఁ బరికించునప్పుడెల్ల నాహృదయము బ్రద్దలగుచుండునే; అల్లదిగో వినుండు,

మ॥ అనుగుం బ్రేయసిచేత నేర్చి, యలవా • లై నాదుకొల్వేగిరా
కను దూరంబునఁగాంచి నేఁటికిని, "అం క్కా! రాముఁడేతెంచె ర"
మ్మని ముద్దారఁగ జానకింబిలుచునే • య్యారంపురాచిల్క మం
తన మింతింతగ నంపమై తునియకుం • డగో యుహృన్మర్మముల్॥

శోకోద్దీపకములగు నిట్టివిషయము లెన్నియో నన్నేచుచున్నను, వానివిడిచి దుఃఖించుటకైన నాకు స్వాతంత్ర్యములేదు. దుఖించిన సీతాపరిత్యాగమువలని ప్రయోజనమే భంగముకాఁగలదు.

లక్ష్మ—ఆర్యా! అట్లయిన మీతపోవన ప్రవేశమునకుఁగూడఁ బ్రజలు విరుద్ధార్థములు గల్పింపకుందురా?

రాము—ఆసంశయముతోడనే యింతకాల మోపికతో నుంటిని.

లక్ష్మ—ఆర్యా! ఇంకెంతకాలమో సంతపింప నక్కఱలేదు. శుభకాలము రానున్నది. ఇంతలో నేదేని యాగమనుష్ఠింపుఁడు. నిష్కంటకముగ సామ్రాజ్య మేలుచున్నారు కాని మనసనాతనధరానేతల నీతి ననుసరించి, యింద్రాదిదేవతలకుం బ్రీతిగనొక్క క్రతువునైన నాచరింపకుండుట మనవంశచారిత్రమునకు

లోపమనిపింపదా ? అశ్వమేధమనుష్ఠించి మామనోభీష్టముల నెరవేర్చెదను. సర్వానిష్టములు తొలంగును.

(తెరలో) హాకుమారా! నీ కీయపమృత్యు వెక్కడ దాపరించె నురా తండ్రీ!

రాము—(ఆకర్ణించి) ఏ మాదీనారవము. అదేమో కనుఁగొనెదను.

(బాలుని మృతకళేబరముతో విప్రదంపతులు ప్రవేశించి)

ఎవరయ్యా! మీమహారాజుగా రెందున్నారు?

రాము—విప్రోత్తమా! మీయాజ్ఞకై యిక్కడనే వేఁచియున్నాను. మీ కేమి యాపద సంభవించినది?

విప్రుఁడు—రాజా! చేతులారఁ గన్నుఁబొడిచి కన్నీ రేలగార్చెద వనుచున్నావుగా? చూడు, (బాలునిమృతకళేబరము క్రిందఁబడవైచి)

ఉ॥ కానుపు లేక లేక చిర • కాలమునాఁటికి నేఁటికేను సం
తానపుముచ్చటం గని ము • దంపడుచుండఁగ నెంతకూ్రరుఁడో
గాని యముండు మాసుతు న • కాలముగాఁ గడ తేర్చె పుత్రదుః
ఖానల మిట్లు మాకడుపు • నందు రగుల్చుట కేమిధర్మమో ?

(అని, శవముపైఁబడి) హా పుత్రా! (అందఱు విభ్రాంతులై చూతురు)

భార్య—రాజేంద్రా! ఈయకాలమృత్యువు మాపాలనే దాపరింపవలయునా నాయనా! చూడు (అని కొడుకుం జూపుచు)

ఉ॥ అక్కట! యొక్కగా నొకకు • లాంకుర మీతఁడు, బ్రహ్మతేజము
గ్రక్కెడు మోమువాఁడు, పదు • నాలుగునిండిన పూఁపప్రాయపుం
జక్కదనంబువాఁ డఖిల • శాస్త్రములం గడిదేఱియున్నవాఁ
డిక్కడు కే కనంబడియె • నే భువి నీయవినీతి యున్నదే ? ॥

బ్రాహ్మ—ఓసీ! ఛాందసురాలా! నీవుండుము. ఈ యవినీతి యూరకే దాపరించినదా!

మ॥ పుడమిన్ లోకులయందుఁ దత్తదుచితం • పుంగర్మముల్ నీతిమై
నడిపింపంగల ఱేఁడె యున్నయెడ నా • నా యిట్టి దుర్బాధ లె
న్నఁడు మున్విన్నవిగావు ధర్మమడుగం • టన్ బుట్టె నీ నాఁటి కీ
కడుపుంగోఁతలు, రామభూవిభు కటా • క్షం బేమనన్ భామినీ॥

రాము—హా హా! ఈ రామునిజీవితమున నెన్నివిషమావస్థలు సంభవించి
నవి. విప్రోత్తమా! శాంతింపుఁడు! విచారించెదను.

బ్రాహ్మ—రాజా! విచారించిన నింతటిముప్పు వాటిల్లునా? చెప్పుము.
ప్రజలలోని యీ యపమృత్యుబాధలకు రాజవగు నీ వుత్తర
వాదివిగావా?

శా॥ పాపంపున్ విధి మమ్ముఁడించి పసిపా • పం జంపుచోఁ, జూచి, పో
నీ పోనిమ్మని యూరకుంట తగవా • నే నీకు నీ దుర్ణయ
వ్యాపారంబుల నిల్పఁగావలయు భూ • పాలుండవై దుష్టశి
క్షాపారీణత లేనిచో నెవఁడు మె • చ్చుంబూని నీ రాజ్యమున్॥

రాము— విప్రోత్తమా! ఇది నాయపచారమే, కాని మీరు కొంతశాం
తించినచోఁ బ్రతివిధాన మాలోచింతును.

బ్రాహ్మ— రాజా; చెట్టంత కొడుకు పడిపోవఁగా మేము శాంతించుట
యెట్లో నీవే చెప్పుము.

సీ॥ పది నెలల్ మోసి క • న్నది, యేతదేకపుత్రిక దని నెట్టు లో • దార్పఁగలవొ
చేతికక్కఱకు వ • చ్చిన బిడ్డ పడిపోయె బ్రతుకు నాకెటు తెల్ల • వాఱ్పఁగలవొ
అలికిన ట్లంకురం • బాటి నాతోఁడీఱు కులముపేరెటు భూమి • నిలుపఁగలవొ
అనపత్యుఁడైన యీ • తని సద్గోగతిఁ ద్రోయఁడను దండధరు నెట్టు • లాపఁగలవొ
గీ॥ కన్నతలిదండ్రులము మేము • సన్నవెనుక నెవనిచే మాకు నీళ్లు పో • యింపఁగలవొ
గద్దె పొంకంబు లాకుట • గాదు నేఁడు బయటఁబడఁగాక నీప్రజా • పాలనంబు॥

రాము— అయ్యా! అనుగ్రహింపుఁడు. కర్తవ్యముంగూర్చి యోచించు
చునే యున్నాను.

బ్రాహ్మ—రాజా! ఇందేమాత్ర ముపేక్ష యొనరించితివా నీతరమున ధర్మములెల్లఁ దాఱుమాఱు గాకపోవు. ఈ వైపరీత్యములకుఁ గారణమేమో యాలోచింపుము. చూడు

శా॥ నాపుత్రున్ శమనుండు నేబ్రతికి యుం ♦ డన్ జంపు టేలాటిదో,
ఈపాపిష్ఠుఁడు కన్నవారిఋణ మ ♦ ట్టేయుంచి తాఁజచ్చె నె
ట్లో, పోనీయని నివ్వు సైఁచుటది యె ♦ ట్లో రాజవై యుండి, నీ
భూపాలత్వము నేఁడు చూచెదను నా ♦ పుత్రుండె జీవింపఁడేన్॥

రాము—సహోదరులారా! ఇప్పుడు కర్తవ్యమేమో తోఁచకున్నది. కానిండు, ఈశవమును ద్వారదేశమునఁ బదిలపఱుపుఁడు. పిదపఁ గాఁదగినది యోచింతము.

(ఆకసమున)

గీ॥ పృథివి శంబూకుఁడనియెడు ♦ వృషలుఁడొకఁడు
బొందితో నింద్రలోకంబుఁ ♦ బొందఁగోరి
తపము గావించుచున్నాఁడు ♦ దగ్రవృత్తి
వాని వధియించి బ్రాహ్మణా ♦ ర్భకుని మనుపు॥

రాము—సహోదరులారా! చూచితిరా రాజధర్మ మెంతదారుణమైనదో. కానిండు, మీయిష్టానుసారము యోగాశ్వము విడువఁబడుఁగాక! ఇంతలో శంబూకవధార్థమై పోయివత్తును. విప్రదంపతులారా! మీబాలుఁడు జీవింపఁగలఁడు; రండు పోదము.

(అందఱు నిష్క్రమింతురు)

—* తృతీయాంకము *—



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# ఉత్తర రాఘవము

## చతుర్థాంకము

(తపస్సమాధిలోనున్న శంబుకుఁడును ఖడ్గపాణి యగు రాముఁడును బ్రవేశింతురు)

రాము—ఆహా! ఈతఁడే యాశూద్రతపస్వి కాఁబోలు; ఔరా! ఈతపోమూర్తి నిస్తరంగసముద్రమువలె నెంతో గంభీరముగ నున్నది! సమీపించి ప్రశ్నించెదను.

ఉ॥ ఓ యతిలోక యోగనియ • మోజ్జ్వల! యెవ్వఁడ వీవు, దుర్ఘటం
బే యభివాంఛితంబునకు • నిట్టి మహోగ్రతపం బొనర్తు, వ
న్నా! యెఱిఁగింపు మేకులము • నం దుదయించినవాఁడవో, వివే
కాయతిఁ గన్నవాఁడవుగ • దా మదిదాఁపవుగా, యథార్థముల్

శంబు—(కన్నులు దెఱచి, లేచి) ధన్యోఽస్మి ధన్యోఽస్మి దేవా!

ఉ॥ అక్షరతత్త్వ బోధకుఁడ • వైన జగత్పతి వీవునాకుఁ బ్ర
త్యక్షముగాఁగ నింకను, య • థార్థము దాఁపఁగ నంతపాపినా?
వీక్షణముల్ ఫలించె, విను • మే వృషలుండను శంబుకుండ, సం
దక్షయకాయసిద్ధిఁ బడ • య౯ దపియింతుఁ, ద్వదేకదీక్షతో॥

రాము— భద్రా! వివేకవంతుఁడవే, ఇది ధర్మవిపర్యయంబని యెఱుంగవా?

శంబు—చం॥ ఎఱుఁగనివాఁడఁగాను జగ • దీశ్వర! యీయుగధర్మమర్మ మే
నెఱుఁగనివాఁడఁగాను మను • జేశ్వర! నీవు రమేశ్వరుండ వం
చెఱుఁగనివాఁడఁగాను ద్విప • మిట్టిది మాకు! విపర్యయంబటం
చెఱిఁగి, యెఱింగి నీ వలన • నే మృతిఁగోర తపంబె చేసితిన్।

రాము—భద్రా! నావలనమృతియే యేలకోరుచున్నావు ?
శంబు—మఱేదియు నక్షరసౌఖ్య మొసంగదుగాన.
రాము—దారుణమగు నాకరవాలముచే నీకట్టిసౌఖ్యము లభించునా?
శంబు—లభింప కేమి ప్రత్యక్ష మేకదా!

ఉ॥ పాతకమూడ్చు నీచరణ ♦ పంకజరేణు వచేతనంపుఁజ
ట్రాతిని నాతిఁజేయఁగఁ బ ♦ రాత్పర! నీదుకరాసి నాదు మా
యాతనుఁ బ్రాడ్చి యక్షరమ ♦ హత్తరకాయ మొసంగదా? జగ
త్త్రాత! హరీ! యెఱుంగుదుఁ గ ♦ దా! భవతారక! నీమహత్త్వముల్॥

దేవా ! ఆలసింపకుము. ఇట్టి నన్నువధించుట నీశరణాగతత్రాణ బిరుదమునకు లోపమగునని తలంతువా నన్ను దండించువరకు నిన్నుఁ బ్రతిఘటించి, తపమే యొనరింతు. దండ్యుఁడు దండింపఁబడకుండుట రాజునకు దోషముకదా! కానిమ్ము, మనుమార్గ ప్రతిష్ఠాపకుఁడవైన నీవు నీవిధి నిర్వర్తింపుము. ఇదిగో నాశిరము.

రాము—హా! హా! రాజధర్మ మెంతిదారుణమైనది.

మ॥ మనుమార్గంబిది యోసి దక్షిణకరం ♦ బా! విప్రసంతానముల్
మనుమార్గంబిది కాన శూద్రమునిపై ♦ నర్గజిమ్ము కౌక్షేయక
మ్మనుమానింపక జానకిన్ సుగుణధ ♦ న్యన్ నిందుచూలాలినే
వని మానన్ గల రాముగాత్రమవు గా ♦ వా? జాలి యింకేటికిన్॥

(అని ఖడ్గము ప్రయోగించును.)

శంబు—(దివ్యపురుషుఁడై) దేవా! రఘుకులేశ్వరా !

చం॥ యమునిదిరస్కరించి, యభ ♦ యంబిడుదండధరుండ వీవు మా
కమరఁ, సజీవుఁడయ్యె ద్విజ ♦ తాసుఁడు విప్రసుతుండు; నాకు ని
స్సమశుభ మే లభించె నల ♦ శంబుకుఁడన్ దల నీ పదారవిం
దములధరింతు, దీనికిఁ గ ♦ దా మృతిఁగోరితి నీ కరంబునన్॥

రాము—భద్రా! ఈ రెండును మాకుఁ బ్రియములే. ఇఁక నీయుగ్ర తపంబునకు ఫలమనుభవింపుము.

గీ॥ పుణ్యములఁ జేసి నిత్యప్ర ♦ మోదములును
శాశ్వతానందములు నొందు ♦ జరుగు నట్టి
తైజసములై వెలుంగు నై ♦ రాజములను
భువనములు నీకు భోగ్యంబు ♦ లగుచు ధ్రువము॥

శంబు— ఈ ప్రభావము నాకు మీయనుగ్రహముచే లభించినదిగాని నా తపస్సుచేఁగాదు, (యోజించి) ఆఁ కాకేమి! తపస్సే నాకు మహోపకారకమైనది. చూడుఁడు,

మ॥ నిను సర్వేశు, జగచ్ఛరణ్యు ఘను ల ♦ న్వేషింతు రట్లయ్యు, నీ
వె నితాంతశ్రమకోర్చి శూద్రు నను న ♦ న్వేషించుచుఁ జేరుటయో
జనము ల్వచ్చుటయేదియో యది తప ♦ స్సాఫల్యమే కానిచో,
ననఘా! వెండియు దండకాటవి కియో ♦ ధ్యన్ దాఁటి రానేటికో॥

రాము—భద్రా! దండకారణ్యమా యిది (పరికించి) అవునుగదా!

మ॥ లలితశ్యామలశాద్వలంబు లొకమో ♦ ర్లన్, భీషణాభోగజాం
గలముల్ వేఱొకచో, స్రవద్గిరిఝరీ ♦ కల్లోలభాంకారసం
కులదిక్కూలము లొక్కచోఁ గలకెలం ♦ కుల్ తీర్థశైలాశ్రమం
బులకాంతారము లివ్వియే పరిచితం ♦ బుల్ దండకాభాగముల్॥

శంబు— దేవా! దండకయే యిది. ఇందుండియే కదా తాము పూర్వము ఖరదూషణత్రిశిరులను పదునాలుగువేల మ్రిక్కిడి రక్కసుల నొక్కుమ్మడి సంహరించితిరి. అందుచేతఁగదా యీజనస్థానము సిద్ధక్షేత్రమై నావంటిభీరుజనమునకుఁగూడ నిర్భయసంచారము లభించినది. చిత్తగింపుఁడు,

గీ॥ కలకలంబేమిలేక ని ♦ శ్చలతనున్న
యీ మహారణ్యసీమలం ♦ దిచటఁ గొన్ని;

కొన్ని దిక్కులుమాఱుమ్రోఁగియు • చున్నవచటఁ
జంబులనిర్ఘాతమృగచయా • ర్భటులవలన॥

గీ॥ భూరిగంభీరఘోషల • బుసలఁగొండ
నాదమై నిద్రవోవు కా • కోదరములు
ఘూఘురశ్వాసపవనపా • ణింధమములు
కాలకూటాగ్నులిచ్చోటఁ • గ్రక్కుచుండు॥

గీ॥ నేలబొరియలలోఁ దాగి • నీరు లేమి
నెండ వేఁడిమి దూఁపిలి, • తొండ లిందుఁ
గొండచిలువల చెమ్మటల్ • గ్రోలుచుండు
భయదములు నిర్జలంబు లీ • ప్రాంతరములు॥

రాము—భద్రా! కనఁబడుచున్నది. ఇది జనస్థానమే. ఇదే యాఖరాసురుఁడున్నచోటు. ఆహా! యానాఁటి వృత్తాంతములన్నియు నిప్పుడనుభవసిద్ధములై కన్నులం గట్టినట్లున్నవి. (తనలో) వైదేహీకారామసీమములన్న నెంతయో ముచ్చట. ఆకాంతారములే యివి. ఇంతకన్న నాకు భయానకములేవి (సబాష్పము)

ఉ॥ ఈవనభూముల౯ శ్రమస • హించుచు జానకి ప్రేమమీఱ, "నా,
థా! విరిదేనెతావులకుఁ • దావల మీవని, మిమ్ముఁగూడి యా
హా విహరించుకంటెఁ గల • దా మఱిసౌఖ్య" మటంచుఁబల్కె నా
భావనిరూఢమౌ ప్రణయ • బంధము వాసెఁగదా హతాశమై!

ఆహా! ఆ ప్రేమరహస్య మేమోకాని

గీ॥ ఎవని కెయ్యది ప్రియజనం • బవును వాని
కదె యమూల్యంపు వింతద్ర • వ్యముగనలరు
ఏదియుంజేయ నక్కఱ • లేదు తనకు
నది సరసనున్న నెల్లయా • పదలు దొలఁగు॥

శంబు—దేవా! ఈయరణ్యములు దుర్గమములు తాము చూడఁదగినవి కావు. ఈపైవి మధ్యమారణ్యములు, మదకలమయూర కంఠ కోమలచ్ఛాయాచ్ఛాదము లైన పర్వతసముదాయములచే నావరింపఁబడి యున్నవి. చూడుఁడు. క్రిక్కిఱిసియున్న పచ్చని లేఁతచెట్ల గుబురులలోఁ బలుతెగల జింకకనుపులు జంకులేక తిరుగుచున్నవి. ప్రశాంతగంభీరములగు నీవియాగు,

చ॥ బలియుశకుంతిపముల్ పఱచి ♦ వ్రాలిన రాలెం ప్రబ్బపూలతా
వులు నలువంక లోకొఱటగు ♦ బుల్కఁనుచల్లని తేఁటనీటిలోఁ
గులుకుచుఁ బాఱు, జాంబవని ♦ కుంజము లాఱఁగఁబండి, వ్రాలి త్రో
వలనకిక్కటటుక్ గుభగు ♦ భధ్వనులన్ లహాకికదంబముల్॥

దేవా! అవి యాకర్ణింపుఁడు

గీ॥ గుహాల నంబూకృత మొనర్చు ♦ గున్న యెలుఁగు
లెలుఁగులవి మాఱుమ్రోఁతల ♦ వృద్ధిఁజెందె;
కరులువిఱిచినయందుగు ♦ గణుపు లోడ్చు
కమ్మతావులు కటువశి ♦ రమ్మలిచట॥

రాము—(కన్నీరాపుకొని) భద్రా! నీకు మార్గములు శుభములగుఁ గాక! విమాన మధిరోహించి పుణ్యలోకములకుం బొమ్ము.

శంబు—పురాణబ్రహ్మవాది యగు నగస్త్యభగవానుని సెలవుఁగైకొని శాశ్వతస్థానమునకుఁ బోయెదను. (నిష్క్రమించును)

రాము—ఈ కారణమున మఱల నీకాంతారముఁ జూడఁగల్గితిని. గేస్తులమై యారణ్యకులమై మేము చిరకాల మిందు సాంసారికసౌఖ్యములలో నోలలాడితిమి. మదకలమయూర క్రేంకార సంకులములగు నాఁటి పర్వతములే యివి. ఇవిగో మంజువంజులనికుంజాభిరంజితములగు నాఁటి యేటిదరులు. అవును,

గీ॥ అదియె కాంచోలు ప్రస్రవ ♦ ణాచలంబు
జలదమాలికవోలె ద ♦ వ్వులకుఁగూడఁ
దెలియనగుచున్నయది (పరికించి) యగుర్ ♦ దీని చెంత
భవ్యగోదావరీ నది ♦ పాఱుచుండు॥

ఉ॥ ఆరయ దీనికొట్టకొన ♦ యందె జటాయువుగూఁడు, క్రింద నా
చేరువనుండి మే మటజ ♦ సీమల, శ్యామల తీరభూరుహా
ళీరుచి గౌతమిన్ బ్రతిఫ ♦ లించి చలించు మనోజ్ఞకాంతి కాం
తార మదే శకుంతకుల ♦ నాదవినోదరసైకధామమా॥

ఆపంచవటియు నిచ్చటనే. చిరకాల మిచటనే కాఁపురముండుటచే నావిస్రంభ సంభాషణముల కీప్రదేశములు సాక్షిభూతములై యున్నవి. ప్రియురాలి నెచ్చెలి యగు వాసంతియు నిచటనేకదా అయ్యో! ఈ రామహతకున కిప్పుడెంత యాపద సంభవించినది!

చం॥ తడవులనుండి, మేన విస్మృ ♦ తంబయి పొంగు విసంబుమాడ్కి, రా
పిడివలనన్ గలక్కుమని ♦ వేఁపెడి లోపలిశల్యఖండమ
ట్లెడద వ్రణంబుమాసియు న ♦ దే మరలన్ సెలవేసి వ్రస్సిన
ట్లడఁగిననాఁటిశోక మిపు ♦ డైనటులే మనసున్ గలంచెడిన్॥

అయినను బూర్వపరిచితములైన యీభూప్రదేశములను జూచెదఁగాక. (నిరూపించి) అహో! మాఱిపోయినదిగదా యీ భూమి సన్నివేశమంతయు;

మ॥ మును పెందుండెఁ బ్రవాహ, మందుఁబులినం ♦ బుల్ నేఁడుగాన్పించుఁ, జె
ట్లనికాయంబున సాంద్రతావిరళతల్ ♦ మార్పండె, నెన్నాళ్ళకో
కనుటంజేసి మఱొక్కకాన యను శం ♦ కల్దోఁచునే కాని, యా
వని యే యీవనియంచు రూఢి నచల ♦ వ్రాతంబు రూపించెడిన్॥

అయ్యో; తప్పించుకొని పోవుదమనుకొన్నను బంచవటీ స్నేహము నన్ను బలవంతముగ నాఁపుచున్నదికదా!

మ॥ మును పెండ్లేఁ బ్రియురాలితోఁ బహుదినం♦బుల్ కాఁపురంబుండియున్
దనివోకెచ్చటిగాథలే సతత మిం♦టం జెప్పుకొంచుండఁ, మా
యనుఁగుం బంచవటిన్ గటా! ప్రియవయ♦స్యన్ మాపి, పెన్బాపినై
చని యేమేమునఁ గాంతుఁ గానకె టుపే♦క్షం జేసి పోఁజాలుదున్॥

శంబు— (మరలఁ బ్రవేశించి) జయము దేవా! అగస్త్యభగవానులు మీరాక నాచే నెఱింగి, మీకిట్లాదేశించినారు, 'మహర్షులందఱు నీకొఱకు నిరీక్షించుచున్నారు. వత్సలయగు లోపాముద్రయు, నీవు విమానమునుండి దిగునప్పుడు గావింపఁదగిన మంగళసంవిధానమును సిద్ధపఱచికొని నీరాక కెదురుచూచుచున్నది. కాన మమ్మెల్లర సంభావించి నా క్రతువు నెఱవేర్చి పొమ్ము' అని

రాము— భగవానుని యాదేశమెట్లో యట్లే జరిగించెదను.

శంబు— దేవా! ఇటు ఇటు.

రాము— భగవతీ! పంచవటీ! క్షమింపుము. గురుజనాదేశ మతిక్రమింపరానిదిగాన నొక్క క్షణకాల మీ రామునకు సెలవిమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

— ఇది చతుర్థాంకము —



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# ఉత్తర రాఘవము

## పంచమాంకము.

(అనసూయయు మురళయుఁ బ్రవేశింతురు)

అన—వత్సా! మురళా! ఎఱుంగుదువు గదా, మీనాయనగారి యాగమునకు వాల్మీకి భగవానులు, జానకిం గూడ నిక్కడకు దయచేసినవిషయము?

ముర—అనసూయాభగవతీ! వాల్మీకులవారిని జూచితినిగాని జానకిజాడ నెఱుంగనే?

అన—అవును ఎఱుఁగవు! ఈవియోగావస్థలో నెరులకింటఁబడకుండున ట్లామహానుభావుఁడు బిడ్డకు వరము ప్రసాదించినాఁడు లే.

ముర—ఆలాగా! అట్లయిన జానకి యిచ్చటనున్నదన్నమాటయేకదా.

అన—ఉన్నది కావుననే నిన్నామె యుపచారమునకు నియమించుచున్నాను.

ముర—కృతార్థురాలనే. మఱి రామభద్రుఁడుగూడ నిక్కడకరుదెంచినాఁడని విన్నాముగదా.

అన—అందుకొఱకే భగవతిగోదావరికి సందేశ మంపితిని.

ముర—ఏమని సందేశము?

అన—ప్రేయసీ! వినిపాతమువలనఁగలిగిన దీర్ఘశోకసంతాపముచే, రామభద్రుఁ డిప్పుడు సగమైయున్నాఁడు. ఇక్కడనుండి యతఁ డింటికిఁ బోవుచుఁ బ్రేయసీచిరసహవాసవిస్రంభములకు సాక్షీభూతములైయున్న పంచవటీప్రదేశములఁ జూడకమానఁడు. స్వభావముచేత నెంతధీరుఁడైనను, నిట్టియవస్థలో నుప్పతిల్లు శోకసంక్షోభ

ములు ప్రతి పదము ప్రమాదకరములుగానే యూహింపఁదగి యున్నవి కాన, రామభద్రుఁడు మూర్ఛిల్లినపుడెల్ల నీశీతలతరంగ చామరములతోఁ గమ్మఁదనంపుఁ బిల్ల తెమ్మెరల వీచుచు నాతని సేదఁదీర్చుచుండుము అని.

ముర — తల్లీ! ఆవాత్సల్యమునకు నీదాక్షిణ్యము తగియేయున్నది; మఱి సీత యెక్కడనున్నదో చూపుఁడు.

అన — గోదావరిమడుగునుండి బయలుదేరినది.

గీ॥ పాలి నవసన చెక్కిళ్ళు, ♦ వ్రేలుకురులు
చిన్ని మోమున శోకవింత ♦ వన్నెఁగూర్పఁ
గరుణమూర్తియొ మైగొన్న ♦ విరహదశయొ
యనఁగ వనికేగుదెంచె న ♦ ల్లదిగో సీత॥

నేఁ డాయుష్మంతులగు కుశలవులకుఁ బండ్రెండవ యేఁడువచ్చి నది; కానఁ దత్సంఖ్యామంగళగ్రంథి కట్టఁబడును. అందుకొఱకు కామె సూర్యభగవానుని బూజింప వలయు. రమ్ము నీవును వత్సననుసరింతు వుగాని. (అందఱు నిష్క్రమింతురు)

— ఇది విష్కంభము —

(తెరలో) అమ్మయ్యో; ప్రమాదము, ప్రమాదము;

(అంతటఁ బూలఁగోయు నాసక్తితో సకరుణౌత్సుక్యముగా సీత ప్రవేశించును).

సీత — అహాహా! ప్రియసఖి వాసంతిమాటయే యిది.

(మరలఁ దెరలో)

మ॥ మునుజేమీఁదుగ, సల్లకీకిసలయం ♦ బుల్ మేసి। యుల్లారుగో
మున సీతాసతి పెంచికొన్న కలభం ♦ పుంగున్న

సీత — ఆఁ దానికేమైనది ?

(మరలఁ దెరలో) స్వీయప్రియాం

గనఁగూడ సరోవిహారములసౌ ♦ ఖ్యంబందుచో గర్వమె
క్కిన వేఁదొక్క గజంబు దాని పడిదాఁ ♦ కెఁ దు ర్ధరోద్దండమై॥

సీత—(తొట్రుపాటుతోఁ గొన్నియడుగులునడచి) ఆర్యపుత్రా! నాపుత్రకుని రక్షింపుము; రక్షింపుము. (స్మృతినభినయించి చింతతో) అయ్యో! మందభాగ్యురాలను. ఈపంచవటీదర్శనమువలనఁ జిరతరాభ్యాసవశములైన యాయక్షరములే నానోట జారుచున్నవి కదా! హా ఆర్యపుత్రా! (మూర్ఛిల్లును)

మురళ—(ప్రవేశించి) సఖీ! జానకీ! ఊరడిల్లుము.

సీత—నెచ్చెలీ! మురళా, వచ్చితివా! ఎన్నాళ్ళకు నిన్నుఁ జూచితిని. ఇటువంటి యవస్థలోనున్న నాసమాగమము నీకు మనోవేదనకే కాని సంతోషమునకుఁ గాదు గదా.

మురళ—సఖీ! చెలులు పంచికొన్నప్పుడే కాదా దుఃఖమునకుఁ గొంత శాంతి.

(తెరలో)విమానరాజమా! ఇందే నిలువుము.

సీత—(విని, బెదరుపాటుతో) అహాహా! నెచ్చెలీ! జలధరధ్వానగంభీరమైన యీ వాక్యనిర్ఘోష మెక్కడిదో, శ్రవణగోచరమైన తోడనే మందభాగ్యురాలికి నాకుఁగూడ నేమో యూరట కలిగించుచున్నది!

మురళ—చెలియా! ఎక్కడిదో యవ్యక్తమైన యానినాదమునకే యుఱుము విన్న మయూరివలె నింతసంభ్రమోల్లాసమేటికే నీకు?

సీత—సఖీ! అవ్యక్తమందు వేమి. సవ్వడింగట్టి గ్రహించినాను. నిశ్చయముగా నార్యపుత్రుని మాటయేయది

మురళ—కాఁబోలు, శూద్రతాపసిని దండించుటకై తృప్తుఁడైన యా రాజు దండకారణ్యమునకే తెంచినాఁడని, విందును.

సీత—బాగు-ధర్మరక్షాతత్పరుఁడుగదా యారాజు.

(పిమ్మటఁ గరుణాశాలియై రాముఁడు ప్రవేశించుచు)

సీ॥ పచ్చరాలపసిండి ♦ భవనంబు లెచ్చోటి ఛాయానపాయ భూ ♦ జములుమాకు
రమణీయమందిరా ♦ రామంబు లెచ్చోటి విరిపందిరులయేటి ♦ దరులుమాకు
వలపించు పన్నీటి ♦ జలదారులే కొండదొవల జాగ్గానుసన్న ♦ సొనలుమాకు
ఇలవేల్పుచుట్టాల ♦ బలగంబు లెచ్చోటి లీలాకురంగబా ♦ లికలుమాకు

గీ॥ అట్టి మాపంచవటి యిదే ♦ యుల్లనాఁటి కాఁపురపుఁ జిన్నెలివె వీనిఁ ♦ గాంచినంత
మతిఁగుములుచున్న దుఃఖాగ్ని ♦ మండఁబోవ మోహధూమంబమోనన్ను ♦ ముట్టడించె॥

(తనలో) హా ప్రేయసీ! జానకీ!

మురళ— ఇదియే గురుజనము శంకించినది.

సీత—(రామునిజూచి) అమ్మయ్యో! గుఱుతుపట్టుటకు సహజగంభీరాను
భావమొక్కటి మిగిలియున్నది కాని, చూడు సఖీ, యీయార్య
పుత్రుని మూర్తియా యిది. అయ్యో! ప్రాతఃకాలచంద్రమండ
లమువలెఁ బాలిపోయి కృశించి, శరీరమెంత దుర్బలమైనది!
సఖీ! మురళా! నన్నుఁ బట్టుకొనుము.

(చెలిని కౌఁగిలించికొని మూర్ఛిల్లును)

మురళ— చెలీ! ఊరడిల్లుము.

రాము— హా! దేవీ! దండకారణ్యవాస ప్రియసఖీ! విదేహరాజపుత్రీ!
(మూర్ఛిల్లును)

సీత— అయ్యయ్యో! మందభాగ్యురాలిని నన్నే పేర్కొని మూఁతలు
పడుచున్న కన్నుఁగల్వలతో నార్యపుత్రుఁడు మూర్ఛిల్లెఁ గదా.
చూడుమమ్మా! యూపిరియు నాడక కటికనేలపైఁబడి యేమో
విపర్యాసముగఁ దోఁచుచున్నారు. అయ్యో, మురళా!
మురళా! రక్షింపుము రక్షింపుము. నాజీవితేశ్వరు నెట్లయిన
బ్రతికింపుము. (పాదములపైఁబడును)

మురళ— కల్యాణీ; నీవే జగత్పతిని బ్రతికించికొనుము. నీకరస్పర్శమే
కదా యీతనికి సంజీవనోపాయము పొమ్ము.

సీత—ఏమైనఁగానీ! ప్రాణసఖి చెప్పినట్లుచేసెదను (అని వేగిరపాటుతోఁ జని నేలపై వ్రాలియున్న రాముని స్పృశించును)

రాము— (ఆనందపారవశ్యమున నిట్టూర్పువిడుచుచు) ఆహా! ఏమిది! హాయి హాయి

చ॥ సలలితచందనద్రుమకి • సాలరసప్రసరంబొ నిండుజా
బిలికిరణాంకురంబుల స్రి • వించిన సారసుధాభిషేకమో
మలమలమాడునాయుసురు • మ్రాఁకు లలిఁ దలిరాకు వేయఁ గ్రొం
జలువల జీవనౌషధి ర • సాయనమో యిది హాయిహాయిరా॥

గీ॥ స్పర్శమిదియెక్కడిదొ పు రా • పరిచితంబె
చిత్తపరిమోహనంబు సం • జీవనంబు
తాపమునఁ గల్గుసోలింతఁ • బాపుఁగాని
తోన నానందమున సొక్కు • లోనె ముంచు॥

సీత—(కొంతహర్షముతో) అమ్మయ్య త్రిలోకనాథునకు మరలఁ బ్రాణములు చేరుకొన్నవి. (భయకరుణములతో నవ్వలికిఁ దొలంగి) ఇప్పటికీపాటి బహుకృతియే నాకుఁ జాలు.

రాము—(లేచికూర్చుండి) వత్సలయగు దేవిచేఁ బ్రసాదింపఁబడలేదుగదా! కానీ, పరికించెదను.

సీత—నెచ్చెలీ! ఆర్యపుత్రులు నన్ను గుర్తించిరేమో రమ్మావలకు. అభ్యనుజ్ఞ లేకయే నాయంత నేను కల్పించుకొనిన యీసన్నిధానమునకై, మహారాజెంతయో నాపైఁ గోపించును.

ముర—ఓసి! బేలా! వాల్మీకి వరప్రభావమున వనదేవతలకుఁగూడ నీవగుపడవు జడియకుము.

సీత—అవును. ఆవర మున్నదికదా.

రాము—హా! ప్రేయసీ! జనకనందినీ!

సీత—(పొలయల్కతోడి దగ్గుత్తికతో) ఆర్యపుత్రా! జరిగిన వృత్తాంత
మేమి యీస్నేహసంభాషణమేమి? మురళా! వినుచున్నావు
కదా! యేమహాభాగునిదర్శనము జన్మాంతరములకైనను దుర్ల
భమని తలంచుచుంటినో యట్టి యార్యపుత్రుఁడు మందభాగ్య
నగు నన్నుద్దేశించి, యిట్లాక్రోశించుచుండఁ జూచి వజ్రమయ
హృదయనై యేమని యీతనియెడఁ గాఠిన్యమువహించి
యూరకుందును, చెప్పుము. ఎఱుఁగుదునుకదా యీతనిహృద
యము నేనును, నాహృదయ మీతఁడును. నెచ్చెలీ! నన్నట్లు
నిష్కారణముగఁ బరిత్యజించినను నిప్పుడవిధముగానున్న యీతనిఁ
జూచుచున్నప్పుడు నాహృదయావస్థ యెట్లున్నదని చెప్పుదును ?

రాము—(కలయంజూచి) అయ్యో! ఇచ్చట నెవ్వరును లేరే. హా
ప్రేయసీ! జానకీ!

గీ॥ తనువునఁ బెలుఁగు ప్రణయావ ♦ తార మనఁగ
స్నేహరసశీతలంబైన ♦ నీదు స్పర్శ
వలనిసోలింత యిప్పటి ♦ వరకు విడదు
ప్రేయసీ! యింక సాక్షాత్క ♦ రింప వేల?

సీత—ఆహా! ఆర్యపుత్రుని యీశోకాలాపము లగాధదర్శితస్నేహ
సంభారములు. ఆనందనిష్యందులు సుధామయములు. వీనియం
దలి విశ్వాసముచేతఁగదా, నిర్హేతుకపరిత్యాగశల్యమున వధింపఁ
బడుచున్నను నాజన్మము చరితార్థమైయెనది.

రాము—లేదులేదు; ఇచ్చట ప్రేయసియెక్కడిది. ఇది, సంకల్ప పరంపరా
భ్యాసముచే రామభద్రు నావరించిన కేవలభ్రాంతి. అంతకంటె
నేమియు లేదు.

(తెరలో) ప్రమాదము, ప్రమాదము.

('మ॥ మును జేమీఁదుగ ... అను పూర్వార్థము పఠింపఁబడును)

సీత—అక్కటా; ఇప్పుడెవ్వ రాపాపిష్ఠిగజము నడ్డగింతురు!

రాము—ఆ! ప్రియసీపుత్త్రునిపై డీకొనుచున్న యీదుర్బుద్ధి యెక్కడ!

వాసంతి—(తత్తరపాటునఁ బ్రవేశించి) ఏమీ! రఘునాథుఁడా!

సీత—ఏమీ! నానెచ్చెలి వాసంతియా!

వాసం—దేవా! జయము జయము.

రాము—(నిరూపించి) ఏమీ! ప్రియసఖి వాసంతియా!

వాసం—దేవా! త్వరపడవలయు. ఇక్కడనుండి జటాయుశిఖరమునకు దక్షిణముగానున్న సీతాతీర్థము మీఁదుగా గోదావరిలోనికిం దిగి దేవీపుత్త్రుని సంభావింపుము.

సీత—హాతండ్రీ! జటాయూ! నీవులేక యీజనస్థానమిప్పుడు పాడువడి పోయినదికదా!

రాము—హాహా! హృదయమర్మములఁ గోయుచున్న వే యీపూర్వకథా ప్రసంగములు

వాసం—దేవా! ఇటు ఇటు

సీత—నెచ్చెలీ; మురళా! నిజమేసుమీ వనదేవతలుగూడ నన్నుఁ జూడఁ జాలకున్నారు.

మురళ—మఱి సాధారణమా. వాల్మీకివరప్రభావము?

సీత—ఆలాగైన వీరి ననుసరింతము రమ్ము. (పరిక్రమింతురు.)

రాము—భగవతీ గోదావరీ! నమస్కారము.

వాసం—(కనుఁగొని) దేవా! ఆనందింపుము వధూసహచారియై దేవీపుత్త్రుఁడు విజయోల్లాసమున నోలలాడుచున్నాఁడు.

రాము—వర్ధిల్లుఁగాక ఆయుష్మంతుఁడు.

సీత—అమ్మయ్య; ఇప్పటి కీకొడుకింతటివాఁడయ్యెఁగదా!

రాము—దేవీ; నీవుకృతార్థురాలవు.

శా॥ బాలక్రీడల నీవతంసలవలీ • పత్త్రంబు గైకొంచు ముగ్ధ
బాలాంభోరుహనాళపల్లవములం • బాటించు నూనూఁగుదం

తాలఁగా్రిలిన నీసుతుం డితఁడుమా ♦ ద్వంద్వంతి నోడించి, నేఁ
డాలంబించెఁగదా కుటుంబిని! వయో ♦ వృద్ధంబైన కల్యాణముల్॥

సీత — సౌమ్యదర్శనయగు తనప్రియురాలితో నీచిరంజీవి వియోగ
మన్నది యెఱుంగకుండఁగాక నెచ్చెలీ! ఇది యిట్టిదైనదికదా.
ఇఁక నాకుశలవు లెట్లగుదురో ?

మురల — సఖి! ఇదియెట్టిదో వారును నట్టివారే యగుదురు.

సీత — చెలీ! ఎంతటియదృష్టహీనురాలను నేను; ఆర్యపుత్రవియోగమే
కాక పుత్రవియోగముగూడనా? మురళా! నేను బిడ్డలంగన్న
ఫలమేమి ? మల్లెమొగ్గలవంటి పలుచని పలువరుసతోడను,
మొలకనవ్వుల కేకిసలచే మిసమిసలాడు పాలబుగ్గలతోడను నంద
గించు నాపుత్రకుల ముఖారవిందములనార్యపుత్రుఁడు ముద్దాడు
చుండఁగాఁ జూడకపోయితినే!

మురల — సఖి! చూచెదవు దైవానుగ్రహముచే;

సీత — ప్రాణసఖి! బిడ్డలు తలఁపునకువచ్చి పాలిండ్లు చేఁపుటచే నిప్పుడు
వారి తండ్రిసన్నిధానమున నేనునుక్షణమాత్రము సంసారిణినైతిని.

మురల — చెలీ! అబ్బురమా యిది? సంతానముకదా ప్రణయప్రకర్ష
మునకుఁ బరమావధి. తలిదండ్రుల పరస్పరానుబంధమును బిగి
యించునది కానుపేకదా!

వాసం — దేవా! ఈదిక్కునఁదిలకింపుఁడు

గీ॥ అపుడపుడె యంకురించుచు ♦ న్నారిపింఛ
మమరుతటి సీత పెంచిన ♦ నెమిలి, యదిగో
సీటుతలకుచ్చురత్నకి ♦ రీటమమరఁ
గొమ్మఁగూడి కదంబానఁ ♦ గూయు నిపుడు॥

రామ — ఆనందింపుము వత్సా ఆనందింపుము.

సీత — అవును ఆనెమిలియే యిది

రాము—నాయనా! మయూరకుమారా!

మ॥ వలయంపు న్నటనక్రమంబు లెఱిఁగిం ♦ పఁగ దారకాచంక్రమం
బుల గుత్తుల్ వెలయించు కంటికిఁ బటు ♦ భ్రూవల్లరీనాట్యముల్
దళుకుల్వోయఁ గరపిరాళిను లేదా ♦ శపత్రికిరియల్ సూపుచుఁ
జెలియాడించిన నిన్ను నాసుతునిగాఁ ♦ జంతుంతు నశ్రాంతముఁ॥

అహాహా! తిర్యగ్జంతువులుగూడఁ బరిచయము మఱచిపోవుగదా!

గీ॥ కాంత మును బెంచునప్పుడీ ♦ కడిమిమ్రాఁకు
కొలఁది తొలిపూఁత చిన్నారి ♦ గుమ్మటంబు

సీత—నిజమే. ఆర్యపుత్రులు చక్కఁగా గుర్తించినారు.

స్వజనమునఁబోలె దీన హ ♦ ర్షంబుగనుచు
ఈగిరిమయూర మిటు సీత ♦ నే తలంచు॥

వాసం—దేవర యిచటఁ గూరుచుందురు గాక.

గీ॥ కదళికారామమున నీవు ♦ కాంతతోడ
మున్ను శయనించు చలువరా ♦ తిన్నెయిదియె
త్రేపుమాపిట సీత చే ♦ మేపులిడుట
హరిణకము లిప్పటికి దీని ♦ మరగి చనవు॥

రాము—సఖీ వాసంతీ; నేదినింజూడ లేను. (ఏడ్చుచు నింకొకయెడఁ గూరుచుండును).

సీత—సఖీ, వాసంతీ; ఈప్రదేశము నార్యపుత్రునకు నాకును జూపించి, యేమిపనిచేసితివే. అయ్యో! అయ్యో అతఁడే యార్యపుత్రుఁడు, అదియే పంచవటి, అల్లదియే ప్రియసఖి వాసంతి. అవియే మాకు వివిధవిస్రంభసాక్షులగు గోదావరీపరిసరవని ప్రదేశములు. అల్లవే నాబిడ్డలవంటివైన మృగములు, పక్షులు వృక్షములును. మందభాగ్యకు నాకివి యన్నియుఁ గన్నుల యెదుట నున్నను, లేనివే కదా. అయ్యో! జీవలోకపరివర్తన మీలాగైపోయెఁ గదా!

హా ! దైవమా; 'నేను లేకయీతఁడును, ఈతఁడు లేక నేనును' అని కలయందైన నెవ్వరుదలంచిరి. నాకిదియొకజన్మాంతరావస్థ కాఁబోలు. కావున నేఁటికైన నాయందనుగ్రహముచేఁ గానంబడిన నాజీవితేశ్వరుని బాష్పసలిలధారావ్యవధానములయందుఁ జూచికొనుచుందును.

మురళ—సఖి జానకీ! చూచికొనుము. వెల్లివొడుచుచున్న యానందశోకాశ్రుపూరములతోఁ బ్రేమామృతమును వర్షించుచు దయితాలోకనోత్కంఠచే నుత్తానధీర్ఘమైయున్న నీచూపు పాలకాలువవలెఁ బ్రియుని నోలలాడించుచున్నది.

వాసంతి—

మ। ఫలపుష్పార్ఘ్యము సంగఁగావుత, తరు ♦ వ్రాతంబు క్రొందేనియల్
దళితాంభోరుహసౌరభంబుల, వనాం ♦ తర్వాయువుల్ వీవుతన్
గలగానంబు లొనర్చుఁగావుత విహం ♦ గశ్రేణి ప్రోత్కంఠమై
చెలిమిన్ వెండి మహానుభావుఁ డరుదెం ♦ చెన్ రాముఁ డీకానకున్!

రాము—సఖి! వాసంతీ! ఇక్కడఁగూరుచుండుము.

వాసంతి—(కూర్చుండి కన్నీళ్ళతో) మహారాజా! కుశలమా కుమారలక్ష్మణునకు ?

రాము—(వినమి నభినయించి)

మ। తటితో లేచి, కరారవిందములు గం ♦ దన్ సీత నీర్వోసి, ని
వ్వరులన్ మేఁపి కుశాంకురంబులిడి, పెం ♦ పన్ సొంపువాటించు నీ
తరుసారంగవిహంగమప్రముఖసం ♦ తానంబుఁగన్గొన్న దు
ర్భర మీగుండెగలంగినీరగువికా ♦ రంబేదొ నన్నే చెరున్

వాసం—మహారాజా! నిన్నే అడుగుచున్నాను. కుశలమా కుమారలక్ష్మణునకు?

రాము—(స్వగతము) ఓహూ! "మహారాజా" అని ప్రేమలేని యామంత్రణము నాకును, సౌమిత్రియెడ మాత్రము బాష్ప

గద్గదాతురముగాఁ గుశలప్రశ్నమునా? ఇందువలన సీతాపరిత్యాగవృత్తాంత మీామెకుఁ దెలియవచ్చినదనియే తలంపవలెను.
(ప్రకాశముగా) ఈఁ కుశలమే కుమారునకు.

వాసం—ఓ దేవా! ఏమందును! క్రూరుఁడవైపోయితివే.

సీత—సఖి వాసంతీ! నీవే యిట్లాడుచుంటివేమి? ఆర్యపుత్రుం డెల్లరకుఁ బ్రేమపాత్రుఁడై యుండఁగా విశేషించి నీకుఁ జెప్పవలసిన దేమి?

వాసం—ఆహా! ఎన్నియిచ్చకము లాడితివి. ఎన్ని నయగారముల వెల్లడించితివి?

చం॥ అమలమతీ! మదీయహృద ♦ యంబునకున్ హృదయంబ వీవు, ప్రాణమునకుఁ బ్రాణమీావు, నయ ♦ నంబులఁజంద్రిక వీవు, గాత్రమందమృతరసంబ వీ వనుచు, ♦ నమ్మెయి నన్నిప్రియంబు, లన్నితీయము లని, యా విముగ్ధనె క ♦ టా! (నిట్టూర్పు విడిచి)

యిఁక నెందుల కాప్రసంగముల్! (మూర్ఛిల్లును)

మురళ—అవును; వాక్యము ముగింపకుంటయు, మూర్ఛయుఁ దగియే యున్నవి.

రాము—సఖీ! ఊరడిల్లుము.

వాసం—దేవా!. ఇంతటియకార్య మొనరించితివేమి?

సీత—వాసంతీ చాలు నూఱకుండుము.

రాము—లోకము సైరింపదని,...

వాసం—అది యేమికారణమున?

రాము—ఏమో దానికే యెఱుక

మురళ—నిందింపవలసినదే లోకమునకు.

వాసం—ఏమిమాట యిది.

ఉ॥ ఓయి కఠోర! నీకు యశ • మొక్కటియేగద వాంఛితార్థ, మ
త్యాయత మింతకంటెఁగల • దా యిల ఘోరతరాపకీర్తి, య
న్నా! యటవీస్థలిన్ బసి య • నాథ, మృగేక్షణ యేమియయ్యె నో
హా హా యధినాథ! యెంతపని • కోర్చితి వేమనుకొంచునుందువో॥

సీత — సఖి వాసంతీ! అనరాదుగాని నీవేదారుణవు కఠోరవును. క్షోభిం
చుచున్న యార్యపుత్రుని మఱింత క్షోభింపఁజేయుచున్నావు.

రాము —

మ॥ చెలి! యింకేమని తెల్పుదున్ సతి గతిం • జెన్ గానలోఁజిక్కి, వి
హ్వాలయై తల్లికిఁబాయు లేడిపసిపా • పంబోలి, నీరాకు పో
ద్దుల గర్భం బతిభారమై జవజవన్ • దూఁగాడుచోఁ బుసు వె
న్నెలతోఁ బోలు తదీయకాయలతికన్ • మ్రింగెన్ వనీసత్త్వముల్॥

సీత — ఆర్యపుత్రా! ఇదిగో నేను బ్రతికియే యున్నాను.

రాము — హా ప్రియా! జానకీ! యెక్కడనున్నావు?

సీత — అయ్యో, అయ్యో, ఆర్యపుత్రులు నాకొఱకై వావిడిచి యేడ్చు
చున్నారు గదా!

మురు — చెలీ! జానకీ! ఇప్పు డింతకంటెఁ గర్తవ్యము లేదు. దుఃఖితులు
దుఃఖోపశమనము గావించుకొనవలసినదే,

గీ॥ వరదవడి, దట్టముగ గట్టు • లొరయు నపుడు
గండి తెఱచినచోఁ దటా • కంబు తెగదు
విపుల శోకంబుచేత క్షో • భించు నపుడు
బిట్టు విలపించుచో గుండె • వ్రీలిపోదు॥

రాము — అక్కటా! ఈరామభద్రుని జీవయాత్ర యెటుచూచినను గష్ట
తరమై పోయెనే.

మ॥ ధరణీపాలనమూ, యథావిధిగఁ గ • ర్తవ్యంబు, లీతాదృక్ప్రియా
విరహంబా మిడిరొండ కొవ్విడినటుల్ • వేధించుగా జీవమున్

బరివర్జించి, తనంత, నేడ్చుటకున్నై నా ప్రాప్తియా లేదు, డె
ప్పరవుం గుండెభరంబుదీర నిపు డే వ్యంగ్యమే లేకదా!
హా హా దుర్భరము దుర్భరము——

శా॥ వీ్రలుం డెందము శోకతీవ్రత ద్విధా భిన్నంబుగా దింతకుం
గూలుం మేను గలంగి మోహమున వీడ్కొ దింకం జైతన్యముం
గాలుం నిల్వున దేహ మూంతరశిఖిం గాదింతకుం బూది యి
స్సీ! లో మర్మము లంటం గోయు విధి వి చ్ఛేదింప దీజీవముం॥

సీత—ఇటువంటిదే యీదుఃఖము.

రాము— ఓ నాయకులారా! పౌరజానపదులారా!

మ॥ అనుకూలింపక పోయె దేవి భవనం బందుంట యేమీ నాకుం. గా
నని కానం దృణమట్లు పేడి, లవమై నం వెన్కం జింతింప, నే
డనుభూతప్రియబాంధవంబులగునా యా భావముల్ మానసం
బున రేంగం విలపింతునియ్యెడ క్షమిం పుండయ్య నేదినుండం॥

మురు—ఈశోకసాగర మతిగంభీరముగనున్నది.

వాసం—దేవా! గడచినదానికై వగచి యేమిప్రయోజనము? ధైర్య
మవలంబింపుడు

రాము—సఖీ వాసంతీ! ఇంకను ధైర్యమనుచున్నా వేమి?

గీ॥ జానకీశూన్యమైన యీ జగతియందుం
బడియు రెండేండ్ల కాల మి ప్పటికిజరగె
'సీత' యనుపేరుగూడ న శించిపోయె
'రాముడు నశించె' ననుమాట రాకపోయె॥

సీత—అయ్యో మురళా! ఆర్యపుత్రుని యీవిలాపములచే నేను
విమూఢనై పోవుచున్నాను.

మురు—నెచ్చెలీ! నిజమే స్నేహార్ద్రశీతలంబులయ్యు శోకనిష్ఠురములగు
టచే నీకీపలుకు లంతహృద్యములుగావు. వలయిన నివియెల్ల విష
రసమలీమసములైన తేనెసోనలై నీమీదం గురియుచున్నవి.

రాము—సఖీ వాసంతీ! ఇంకెంతకాలము సైరింతును.

మ॥ నరముల్ గాఢముగ నాటుకొన్న విషదం • ష్ట్రింబోలి; డెందాన ని
ష్ఠురతఁ గ్రుచ్చి మెలిఁ దలంచుకొఱకం • చుంగాలముంబోలి దు
ర్భరమై దారుణశోకకీల మిటుమ • ర్మశ్రేణులంబట్టి యే
డ్తెఱమై చీల్చుచునున్న నోర్చుకొనలే • దే మొండిసై నెచ్చెలీ॥

సీత—అక్కటా! ఎంతటి మంద భాగ్యురాలను; ఆర్యపుత్రున కీవిధముగ మాటిమాటికి నాయాసము కలిగించుచున్నాను.

రాము—సఖీ వాసంతీ! ఈవిధముగ నంతఃకరణమును జలియింపనీక యెంత చిక్కబట్టుకొనియున్నను బూర్వానుభూతములగు నా యావస్తువుల సందర్శించుటచే నిప్పుడు నాకీ సంక్షోభము తటస్థించినది. ఈ యావేగము నరికట్టుటకు నే నెట్టి గట్టియత్నము లొనరించుచున్నను నవియెల్ల, మహాప్రవాహరయము నందు, సైకత సేతువువలె భిన్నములై బలాత్కారమగు శోకవికారము నన్నావరించుచున్నదిగదా!

సీత—అయ్యో! దుర్వారవిప్లవారంభమగు నార్యపుత్రుని యీ దుఃఖసంక్షోభముచే నాహృదయము, తనదుఃఖావస్థను మఱచి పోయి కలగుండువడుచున్నదిగదా!

వాసం—(స్వగతము) ఈ మహానుభావుఁ డత్యాపన్నుఁడై యున్నాఁడు; కావునఁ బ్రసంగాంతరమున కీతని హృదయము మరల్చెదను, (ప్రకాశముగ) దేవా! పూర్వానుభూతములైన యీజనస్థాన ప్రదేశముల నించుక పరికింపుఁడు.

రాము—అట్లేకానిమ్ము (లేచి పరిక్రమించును.)

సీత—ఆహా! ఈవాసంతి దుఃఖోద్దీపకములనే వినోదోపాయములని భ్రమించుచున్నది కదా.

వాసం—దేవా! జ్ఞాపకమున్నదా?

మ॥ కనుఁగొమ్మాపాదరింటనే చెలియ రా • కిఁ వేచియున్నావు, మా
నిని గోదావరిరేవునం దిసుక తి • న్నెఁ హంసలఁ గాంచుఁజో
కను జాగై చనుదెంచు చీవు పొలయు • ల్కంఠంగొన్న సన్నం గ్రహిం
చి నవాంభోరుహాకోరకాభము రచిం • చెన్ భీతి సేవాంజలిఁ

సీత—వాసంతీ! కఠినురాలవుగదా నీవు; హృదయమర్మశల్యములఁ గద
లించు నీలాటివృత్తాంతములతో మాటి మాటికి మందభాగ్యు
రాలిని నన్నును, ఆర్యపుత్రునింగూడ సంతపింపఁ జేయుచున్నావు

రాము—హాచండీ! జానకీ! ఇందందుఁ గానఁబడుచున్నట్లుండియు జాలి
వహింపవుగా!

శా॥ హా దేవీ! హృదయంబుభిన్నమగు, వ • క్షోదేహబంధంబులుఁ
లేదయ్యెఁ జగమే, దహించు నమితా • గ్నిజ్వాల లోలోపలఁ
మీఁదుంగ్రిందు నెఱుంగ కాత్మము తమో • ంధభూతమై పోయె హా!
హా! దౌర్భాగ్యుఁడ నేమిసేయుదు, విమో • హాంభోధిలో మున్గితిఁ॥

(అని మూర్ఛిల్లును)

సీత—అయ్యో అయ్యో! ఆర్యపుత్రుఁడు మరల మూర్ఛపోయినాఁడు
గదా!

వాసం—దేవా! ఊరడిల్లుము. ఊరడిల్లుము.

సీత—హా! జీవితేశ్వర! సకలలోకైక కల్యాణమూర్తివైన నీవు, మంద
భాగ్యురాలనగు నానిమిత్తమై మాటిమాటికి జీవితసంశయ
దారుణంబగు నీలాటి యవస్థాపరిణామము ననుభవించుచుంటివే.
సఖీ మురళా! ఇఁక నేఁబ్రతుకలేను.

ముర—చెలియా! ఊరడుము. మరల నీకరస్పర్శమే రామభద్రునకు
సంజీవనోపాయము.

వాసం—అయ్యో, ఇఁకనేమిగతి, ఇప్పటికిని మూర్ఛదేరకున్నాఁడు
హాప్రియసఖీ! జానకీ! నీప్రాణేశ్వరు నింకను సంభావింపవేమి?

(సీత తత్తరపాటుతో సమీపించి రాముని హృదయమునందును, నెన్నుసటియందును స్పృశించుచున్నది.)

వాసం—అమ్మయ్య రామభద్రునకు మరలఁ బ్రాణములు చేకూరుచున్నవి.

రాము—ఆహా! ఏమిది.

గీ॥ తనువునందున్న లోవెలి ♦ ధాతువులను
అమృత రస లేపముల నోల ♦ లార్చినట్లు
స్పర్శ మేదియో మరల జీ ♦ వం బొసంగి
ముంచె నాకస్మికానంద ♦ మూర్ఛలోన॥

సఖీ వాసంతీ! అదృష్టవంతురాలవు

వాసం—ఏమి యేమి ?

రాము—మత్తేమున్నది. మరల జానకి దొరకనేదొరికినది.

వాసం—రామచంద్రా! ఆమె యెక్కడ?

రాము—(స్పర్శసుఖమనుభవించుచు) ఇదిగో యెదుటనే యున్నది.

వాసం—ఓయీ ప్రియసఖీవియోగదుఃఖమున నిదివరకే దహింపఁబడుచున్న యీమందభాగ్యురాలిని, మాటిమాటికి మర్మచ్ఛేదకఠోరములగు నీలాటి ప్రలాపములచే నేలదహించెదవు?

సీత—ఆహా! అవ్వలికిఁదొలంగి పోదలంతుఁగాని, అంతటి దీర్ఘదుర్భరమైన నా సంతాపమునుగూడ రవంతలో నడఁగించునదై చిరతరస్నేహప్రసన్నశీతలంబైయున్న యార్యపుత్రుని యీకరస్పర్శముచే వజ్రమయమగుటంకమున నతికింపఁబడినట్లు నా హస్త మీవలకు రాకున్నదే!

రాము—సఖీ వాసంతీ! ప్రలాపములుగావు నిజముగ సీత దొరికినది.

చం॥ పరిణయవేళఁ గంకణ శు ♦ భంకర మేకర మందికొంటి, నే
శ్శర మనుభూతమయ్యెఁ జిర ♦ కాలమునాకు, యథేచ్ఛమై సుధా

ఖురశిశిరంబులైన యుప • చారములఁ గర కాతుపారసుం
దరలవలీహ్యాసాలలి • తం బిపు డాకరమే గ్రహించితిఁ॥

సీత—అయ్యో అయ్యో! ఆర్యపుత్రసంస్పర్శమువలని విమోహముచే
నాకుఁ బ్రమాదము సంభవించెనే!

వాసం—అకటా! ఉన్మాదమే!

సీత—(సంభ్రమమున విడిపించుకొని యవ్వలికేగును)

రాము—హా; హా; వాసంతీ ప్రమాదమేమైనది.

వాసం—దేవా! ఏమి ఏమి.

రాము—ఇంకేమున్నది.

గీ॥ జడము, ప్రస్వేదకంబు, చం • చలమునైన
సకియ చిగురాకుఁజే యిట్టె • జాఱిపోయె
జడము ప్రస్వేదకంబు చం • చలమునైన
నాకరమునుండి యున్న దు • న్నటులెయుండె॥

సీత—అయ్యయ్యో! ఆర్యపుత్రుఁడిప్పటికిని దన్నుఁ దాఁ దెలిసికొన నేర
కున్నాఁడు. నేత్రములకింకను నైజవిలాసము రాలేదు. కను
జూపులు నిశ్చలములై యెదుటనున్న విషయమునుగూడ సం
గ్రహింపనేరక యూరక ఘూర్ణమానము లగుచున్నవి.

తమస—(సస్నేహకౌతుకమున సీతను నిరూపించి)

గీ॥ నాతిమేను ప్రియస్పర్శ • నాతి హర్ష
మునను జలియించి, చెమరించి • పులకరించెఁ
బవనమునఁ దూఁగి తొలకరి • వానఁ దోఁగి
కోరగించుకదంబంపుఁ • గొమ్మవోలె॥

సీత—ఓహో! "పరిత్యజించిన మగనిపై దీని కింత యనురాగమేమి"
యని మురళ నన్నుఁ జూచి యేమనుకొనుచున్నదో యని నాకు
సిగ్గగుచున్నది.

రాము—హా! ఏమిది జానకి లేనే లేదే! ఓసీ నిర్దయురాలా! వైదేహీ!

సీత—ఆ నిజముగా, నేను నిర్దయురాలనే, ఇట్టియవస్థలోనున్న మిమ్ముఁ జూచుచుండియు జీవించియున్నాను.

రాము—హా ప్రేయసీ; ఎందున్నావు? అనుగ్రహింపవా? ఇట్టి నన్ను విడనాడిపోవుట నీకుఁదగునా?

సీత—ఆర్యపుత్రా! విపరీతముగాదా యిట్లనుట

వాసం—దేవా శాంతింపుఁడు, మేరమీఱిన వియోగదుఃఖముచేఁ బరవశమైన మీహృదయమును, లోకోత్తరమైన మీధైర్యముచేతనే కుదుటఁబఱచికొనుఁడు. ఇక్కడ నాప్రియసఖ యెక్కడిది?

రాము—నిజమే, లేదు; ఉన్నచో వాసంతికైన నగుపడదా? ఇది స్వప్న వృత్తాంత మేమో! నేను నిద్దురపోలేదే! మొదలు రామునకు నిద్ర యెక్కడిది! ఇది నిశ్చయముగా నిరంతరసంకల్ప పరంపరలచేఁ గల్పింపఁబడిన కేవల చిత్తభ్రాంతి. ఇదే సర్వథా నన్ను వెన్నాడుచున్నది.

సీత—కఠినురాలను నేనే యార్యపుత్రుని మోసగించితిని.

వాసం—దేవా; చూడు చూడు,

మ॥ ఉరుదైతేయు నయోరథంబిదె, జటా • యుర్భిన్నభిన్నంబు; త
త్ఖరవాహంబులవే, పిశాచముఖముల్ • కంకాళశేషాంకముల్;
పరుఁడిచ్చోట జటాయుపక్షియుగము • త్పాటించి రోషోజ్జ్వల
ద్ధరణీజం గొనిపోయె మింటఁ జలదం • తశ్చంచలాంబ్దంబనన్॥

సీత—(భయముతో) హా! ఆర్యపుత్రా! తండ్రి వధింపఁబడుచున్నాఁడు. రక్షింపుము రక్షింపుము. నే నపహరింపఁబడుచున్నాను.

రాము—(వేగమున లేచి) అరేపాపీ! తాతప్రాణసీతాపహారీ! ఎందుఁ బోయెదవురా?

వాసం—దేవా! రాక్షసకులప్రళయధూమకేతూ! ఇప్పుడును నీక్రోధమున కాస్పదముకలదా?

సీత—అహహా! ఉన్మత్తనైతినే!

రాము—ఇప్పుడు నిజముగాఁ బ్రలాపమేచేసితిని. ఇప్పటి వైపరీత్య

మాట మటువంటిదికాదు. ఇదివేఱువిధమైనది. అక్కటా!

ఉ॥ ఆవిరహం బుపాయనివ • హంబుల నిత్యవినోదహేతుకం
బై, వివిధోగ్రసంగర వి • హారములన్ జగదద్భుతావహం
బై, వినువేది శాత్రవవ • ధావధి సైఁచఁగనయ్యె ము, న్నరయో!
ఈవిరహాబ్ధి కేయవధి • యేది ప్రతిక్రియ నేఁడు సైఁచఁగన్॥

సీత—ఏమీ దీని కవధియే లేదుగా! హా మందభాగ్యురాలను చెడి పోయితిని. (ఏడ్చును.)

వాసం—దేవా! దీనికిఁ బ్రతిక్రియయే లేదా!

రాము—ఇంకేమి ప్రతిక్రియ వాసంతీ! హా హా కష్టము

సీ॥ కపికులేశ్వరుని స • ఖ్యం బెందుఁ గానఁగాదు
కపిసేన లెచట న • క్కఱకు రావు
జాంబవన్మతికి లే • శం బెందుఁ బనిలేదు
హనుమంతుఁడేని యెం • దరుగ లేఁడు
ఎచట సేతువు నలుం • డేని నిర్మింపలేఁ
డలవిభీషణుఁడేని • రక్షుఁడెందు
సౌమిత్రిబాణసం • చయ మెందుఁ జొరలేదు
నాశక్తి కెందు య • త్నంబె లేదు

గీ॥ అక్కటా! యట్టిదుర్గమం • బైనచోట
నెచటనున్నావె జానకీ! • యెందుఁగన్నఁ
బ్రాణములఁగోసియిడునింత • బలగముండి
ప్రేయసీ! నీయవస్థ త • ప్పింపలేరు॥

సఖీ వాసంతీ! ఇప్పుడు రామదర్శనము సఖులకు దుఃఖము కొఱకే. ఇట్లెంత కాలము నిన్నేడిపింతును. సంకల్పితమగు నశ్వమేధము నిర్వహించుటకై శీఘ్రముగఁ బోవలసియున్నది. కాన నాకింకఁ బయనమున కానతిమ్ము.

సీత—(ఉద్వేగముతో మురళం గాఁగిలించుకొని) అయ్యో! మురళా! ఆర్యపుత్రుఁడు వెడలిపోనే పోవుచున్నాఁడు. నాకింకేమిగతి (మూర్ఛిల్లును.)

ముర—చెలీ! జానకీ! ఊరడిల్లుము. ఆయుష్మంతులగు కుశలవుల

వర్షవర్ధన మహోత్సవము నిర్వర్తింప, భాగీరథీపదసన్నిధానము నకు మనముసు బోవుదము రమ్ము.

వాసం—పాపము శమించుఁగాక! అశ్వమేధ నిర్వహణమా? మఱి సహధర్మచారిణి యెవరు?

రాము—ఉన్నదికదా బంగారపు సీతాప్రతిమ.

సీత—(నిట్టూర్చి కన్నీటితో) అహా! ఆర్యపుత్రుఁడవే యిప్పుడు నీవు. ఇప్పుడు నాపరిత్యాగశల్యము లాగివేయఁబడినది.

రాము—దానింజూచుకొనుచు నైనను బాష్పపూరితమైన నా నయనమును గొంతవినోదింపఁ జేసికొందును.

సీత—అహా! ఆర్యపుత్రునిచే బహుమానింపఁబడుచున్న యాప్రతిమ ధన్యగదా. అది ఆర్యపుత్రుని వినోదింపఁ జేయునదై జీవలోకమున కెల్ల నాశానిబంధనమైనది.

మురళ—(చిఱునవ్వుతోడను, స్నేహబాష్పములతోడను గౌఁగిలించి) సఖీ! నిన్ను నీవే పొగడుకొనుచున్నావు.

సీత—(లజ్జతోఁ దలవంచి) మురళ నన్నుఁబరిహాసించుచున్నది.

వాసం—దేవా! ఈసమావేశము మాకు మహాప్రసాదము. కార్యభంగముగాకుండునట్లు ప్రయాణ మనుసంధింపుఁడు.

సీత—అయ్యో! నాకిప్పుడు వాసంతి ప్రతికూలయయ్యెనే

మురళ—చెలియా! రమ్ము. పోవుదము.

సీత—(కష్టముతో) వచ్చుచున్నాను. దుర్లభదర్శనుని క్షణమాత్రము చూచుకొందును. (పోవుచు) అపూర్వపుణ్యపరిపాకముచే దర్శన మిచ్చిన యార్యపుత్రుని పాదపద్మముల కిదేనమస్కారము.

(మూర్ఛిల్లును)

మురళ—సఖీ! ఊరడిల్లుము లెమ్ము.

సీత—మేఘాంతరమందలి పూర్ణచంద్రదర్శన మెంతసేపు.

రాము—విమానరాజమా! ఇటు ఇటు. (అందఱు లేచుచున్నారు.)

ఇది పంచమాంకము.



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# ఉత్తర రాఘవము

## షష్ఠాంకము.

( వటువులతోఁ గుశలవులు పాడుచుఁ బ్రవేశించుచున్నారు. )

గేయము - కాఫీ - చతుశ్రగతి.

రామ-సకలగుణధామా-తారక నామా-రఘుకులసోమా ॥పరం॥

ధామా రాజలలామా-కలుషవిరామా దశరథ రామా ॥జయ॥

తాపసయాగవి-దారణదారుణ-దైత్యవిభంజనరామా ॥ పురహార॥

చాపవిపాటన-పాటవ, ధరణీ-జారమణీవర రామా ॥జయ॥

పరశురామ బల-భంజన రామా-ప్రముదితపార్థివరామా ॥రామా॥

పరిపాలిత గురు-వచనా, వనసం-చరణా, మునిజనశరణా॥జయ॥

ఖరదూషణముఖా-సురసంహరణా-శరణాగత కపిభరణా॥ రామా॥

శరనిధిబంధన-సురరిపుభంజన-జగదభిరంజన రామా ॥జయ॥

గాలవుఁడు—కుశలవులారా ! మీరు వేయేండ్లు వర్ధిల్లవలయు !

లవు—అయ్యా! ఈయప్రస్తుతాశీర్వచన మెందుకు ?

గాల—అప్రస్తుత మేమి ? నేటి కైదు దినములనుండియు మీవర్షవర్ధన మహోత్సవములు జరుగుచున్నవి కదా ?

కుశు—అవును. అయిన,

గాల—ఆసందర్భములో నివేకా యథేచ్ఛగా మాకీ యనధ్యయన మహోత్సవములును !

కుశు—ఓహో, మీకందఱకు నధ్యయన భంగము గలిగించితిమనియా మాకీబహూకరణము.

గాల—మాకధ్యయనభంగ మిప్పుడు క్రొత్తగా సంభవించిన దేమున్నది? ఏనాఁడు మాకు మీసహాధ్యాయిత్వము లభించినదో యానాఁడే.

కుశు—ఏమయ్యా మేము మీకు సహాధ్యాయులమై యుండుటకైనఁ బనికిరామా ?

గాల—అఁ పనికిరాని మాటే నిజము.

లవు—ఏమీ ! మేమంత విద్యాసక్తిలేని మూర్ఖులమా ?

గాల—కారు కావుననే మీకును మాకును సహాధ్యాయిత్వము కుదిరినది కాదు. పాఠ ముపాధ్యాయులనోట నుండఁగనే గ్రంథమంతయు మీహృదయ ఫలకముల నుండును. మృణ్మయపాత్రలవంటి మా మొద్దు తలకాయలకు, మీకున్న ఘుటితిగ్రహణశక్తి లేకపోవుటచే బడిలోఁ బ్రవేశించునాఁ డేస్థితిలో నున్నదో నేఁటివరకాస్థితిలోనే యెదుగు బొదుగు లేకుండఁ గనుబొమ్మలమీఁది వెండ్రుకలవలె మాచదువో కేతీరుగ సాగుచున్నది. విద్యాబుద్ధులలో మా కీడు జోడుగానుండు సహాధ్యాయులతోఁ జేరి వేరొక యుపాధ్యాయుని నాశ్రయింతమా యని యనుకొందుము కాని, మీస్నేహపాశముచేఁ గదలమెదల లేక యిక్కడనే కట్టఁబడినట్లున్నాము.

కుశు—అయ్యా! గాలవా! మీస్నేహధర్మము మెచ్చఁదగియున్నది. కాని తెలియక యడుగుచున్నాను. వెనుకటి పాఠము లేమైన స్ఫురణలో నున్నవా ?

గాల—మిత్రుఁడా ? వెఱ్ఱివాఁడవుగదా ? వెనుకటివి వెనుకకుఁబడియుండక ముందునకుఁబడునా ?

కుశు—ఏమీ ! అప్పుడప్పుడు వెనుకటివి చింతించుచుండవా ?

గాల—మొదటనే తెలివితేఁట లుండవలయునుగాని, వెనుక చింతించుట వెఱ్ఱితనము కాదా ?

లవు—వివేకవంతుఁడవు పోనీ ఈమధ్యఁ జదివిన ఇంద్రజిత్తు యుద్ధఘట్టములోని శ్లోకములైన జ్ఞాపకమున్నవా ?

గాల—నాయనా ! ఈ యుద్ధకాండ మేవేళఁ బ్రారంభించితిమో కాని కంటి కింత హాయిగా నిద్దురపోయి యెఱుఁగనుగదా ?

లవ—అంతదీక్షగఁ జదువుచున్నావా ?

గాల—చదువు లేదు చట్టుబండలు లేదు; కన్నుమోడ్చుటయే తడవుగా, లంకలోని దిక్కుమాలిన రక్కసిముండకొడుకులందఱు, నానావికృతాకారములతో నాకు సాక్షాత్కారమగుచున్నారిదేమికర్మము. అయ్యో! అయ్యో! ఆ వ్యాఘ్రాననాలేమి! ఆ మార్జారనేత్రాలేమి! ఆ లొట్టిపిట్టపీఁపులేమి! ఆ బొరముక్కులేమి! ఆ పారపండ్లేమి! ఆ చీరపేల జుంజురు వెండ్రుకలేమి! ఆ నవ్వులేమి! ఆ కేకసలేమి! ఆ యట్టహాసాలేమి! హుమ్మనువాఁడొకఁడు హామ్మనువాఁడొకఁడు హుష్షనువాఁడొకఁడు హాష్షనువాఁడొకఁడు బాబూ అనరాదుగాని రామాయణయుద్ధకాండపారాయణమునకు ఫలముగా నన్ను బ్రహ్మరాక్షసపిశాచములుపట్టి వేధించునేమోయని లోలోపల నడలిచచ్చుచున్నాను.

కుశ—గాలవా! ఇదియే వాల్మీకిమహానుభావుల కవిత్వములోనున్న రహస్యము.

గాల—ఏది! బ్రహ్మరాక్షసపిశాచసాక్షాత్కారమా ?

కుశ—కాదోయి, వర్ణనాంశములనెల్లఁ జదువరులకు సాక్షాత్కరింపఁ జేయుటయే.

గాల—అదియా? ఆలాగైన నాతోఁబాటిగొడవ మీకును సంభవించినదన్నమాట.

లవ—అయ్యా! గొడవయేమిటి, రసపారవశ్యము, తన్మయత్వమన నిదియే కదా, చెప్పుము. రాక్షసులతోఁబాటు సుగ్రీవాది వానరపుంగవులు నీకుఁ గన్పించుట లేదా ?

గాల—నాయనా! చాలు. ఇక్కడికి రక్కసిమూఁకతోడనే చచ్చుచున్నాను పైపెచ్చు కోఁతిమూఁకగూడ నెందులకు? నిద్దురలో వానరదర్శనముకంటె మృత్యుదర్శనము మేలన్నారు. మీపుణ్యమున నాకింకను ఆ యోగముపట్టలేదు.

కుశు_పోనీ సీతా రామలక్ష్మణులు కనిపించుచున్నారా?
గాల_లేదు, అబద్ధమెందులకు. పాపము వారెవ్వరు నాజోలికి రాలేదు.
లవు_అనఁగా వారిని నీవు చూడనే లేదన్నమాట
గాల_చూచుటకు వారు నాకడకు వచ్చినారా?
కుశు_పోనీ నీవైన వారి సన్నిధానమునకుఁ బోలేదా?
గాల_పోవుటకు దగ్గఱా దాపా?
కుశు_గాలవా! అడుగునకు దూరముగాని యంతఃకరణమున కేమి దూరము?
గాల_అదేమో నాయంతఃకరణ మంతవరకుఁ బోలేదు సుమా.
లవు_ఇదేమి గాలవా! లంకవరకుఁబోయి రాక్షసుల నందఱింజూడఁగల్గిన నీయంతఃకరణము రాముని జూడక పోవుటయేమి?
గాల_రాముఁ డయోధ్యలోఁగదా యుండునది.
లవు_ఇప్పుడు మనము చదువుచున్నది యుద్ధకాండము కాదా?
గాల_అవునుసుమా అదియు మఱచితిని. ఇప్పుడు లంకలోనే యుండును. కాని, చూడలేదు.
లవు___ఎందుచేత?
గాల___మీ ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరములీయలేక చచ్చుచున్నాను. ఇంతమాత్ర మూహింపలేకున్నావు! నీ తెలివి యింతలోఁ దెల్ల వాఱినది. రాక్షసుల వికృతాకారములు రామునకున్నవా?
కుశు___ఓహో! వికృతాకారులగు రాక్షసులఁగాని యన్యులంజూడనని దీక్ష పట్టితివా యేమి?
గాల___ఎందులకువచ్చిన దీక్షయది; పుణ్యమా పురుషార్థమా? నేను వారినిజూడ లేదు. వారే నన్నుఁ జూచుచున్నారు; వెక్కిఱించుచున్నారు, వెఱపించుచున్నారు, నవ్వుచున్నారు, పేలుచున్నారు, సోలుచున్నారు, తూలుచున్నారు, తిట్టుచున్నారు, మొట్టుచున్నారు వారి శ్రాద్ధాలేమో పెట్టుకొనుచున్నారు.

లవు—అదియా? గాలవా! నీ పిటికితనము యుద్ధకాండపఠనమునకు బాగుగా నక్కఱకువచ్చినదిసుమా?

గాల—ఎట్లు?

లవు—యుద్ధవర్ణనమంతయు యథాక్రమముగా నీకుఁ బ్రత్యక్షముచేసినది.

గాల—మీకుమాత్రము ప్రత్యక్షము కాలేదా?

కుశు—కాకేమి?

గాల—అలాగైన నాతోఁబాటు మీరుగూడ నేల పిటికివారు కాకుందురు?

కుశు—మేము నీవలె భయపడుచుండలేదు. యుద్ధకాండపఠనముచే మా కెంతరణోత్సాహము కలుగుచున్నదో నీ వెఱుంగవు, విను,

మ॥ శరసంధానవిధానమం దితఁడు సా ♦ టౌదార్యముఁ జేయంచు వా
నరయోధాగ్రణు లుగ్గడింపఁ, బ్రళయాం ♦ తకూర్రసంరంభ దు
ర్భరకాలానల రుద్రభంగి, విశిఖ ♦ జ్వాలావళిన్ బం క్తికం
ధరుసేనాటవిఁ గాల్చు నాభుజము లు ♦ త్సాహంబునం బొంగెడిన్॥

లవు—గాలవా! ఇఁక నాయుత్సాహమునకు మేరయే లేదు.

శా॥ పంకేజప్రభవాండభాండముఁ బగు ♦ ల్పంజాలు దీవ్యద్ధను
ష్టాంకారం బెలయించుచున్ బటునిశా ♦ టశ్రేణిపైఁ బేర్చి త
త్కంకాళంబులు రక్తవాహినులవెం ♦ టన్ బార, వారాంనిధిన్
లంకాద్వీపము ముంతునా యను సము ♦ ల్లాసంబునన్ బొంగెదన్॥

గాల—అయిపోయినపెండ్లికి మేళమెందుకు? శాంతింపుఁడు.

లవు—ఏమైనది యుద్ధకాండ మింకను బూర్తి కాలేదుగా?

గాల—అవునుసుమా! అసలు గడుసుముండకొడుకు, కొఱుకరాని కొయ్య, పదితలల శిఖండి యింకను నక్లేయున్నాఁడుగా!

కుశు—చేపో మాపో వానిపనియుఁ బూర్తి కాఁగలదు.

గాల—వాఁడుకడ తేఱినఁగాని నా ప్రాణమునకు హాయి లేదు. కాని, ఆ దేవాంతకపుముండకొడుకును రాముఁడుమాత్రము సాధింపఁగలుగునా?

కుశ—గాలవా! రామాయణ మింతవరకుఁ జదివినను రామప్రతా
పము నీకు బోధపడినట్లు లేదే; నీ కాసందేహ మెందులకు?

మ॥ హరకోదండవిఖండనక్షమము బా • హాదండ, ముగ్రక్షపా
చరసేనావనదావపావక ముదం • చచ్ఛౌర్య, మంభోనిధి
స్ఫురదాటోపవిభంగ చంగము పటు • భ్రూభంగ మా రాఘవే
శ్వరు సుర్వార పటుప్రతాపగుణసం • పచ్ఛీలలన్ దెల్పవా?

గాల—తెలుపుచునే యున్నవి కాని ముల్లోకముల ముప్పతిప్పలఁ బెట్టి
మూఁడు చెఱువుల నీళ్ళు ద్రాగించిన ముండకొడుకు వాఁడు మాత్రము
సామాన్యుఁడా,

లవు—సామాన్యుఁడైనచో శ్రీమన్నారాయణమూర్తి యేటికొఱకు రామ
మూర్తియై యవతరింపవలసినపని యేమున్నది?

గాల—సరియే కాని, ఈబ్రహ్మ కింతమతి లేకపోవుట యేమా యని
యోజించుచున్నాను. అందఱికి నొక్కతల రెండుచేతులు మాత్రము
సృష్టించి యీరక్కసచచ్చినవానికిఁ బదితలలు నిరువదిచేతులును
సృష్టించినాఁ డెందులకో?

కుశ—ఇది రాక్షససృష్టి కదా!

గాల—ఆమాట నేనొప్పుకోను. రాక్షసు లందఱికి నిట్లుండిన లోకము
లన్నియు నీవరకే నిర్మూలములు కాకపోయినవా? పాములలో
రెండుమూఁడుతలలశిఖండులఁ బుట్టించినట్లు రక్కసులలో నీపది
తలలశిఖండిని బుట్టించినాఁడు. పరకాంతాపహరణపాపకర్మమునకు
వీనికి రెండుచేతులు చాలవని యిరువదిచేతులను, బరమసాధువులైన
దేవమానవతపోధనుల రక్తమాంసములఁ బీల్చుటకు నొక్కనోరు
చాలదని కఱవుదీరునట్లు పదినోళ్ళను వీనికి సృష్టించినాఁడు. ఈ
మొండికట్టె కొకనాఁడైన దగ్గుపడిసెము పట్టలేదు కాఁబోలు. పట్టిన
చోఁ బదిముక్కు లొక్కమాఱు టంగునబిగిసి, యూపిరియాడక
యెన్నఁడో చచ్చియుండును. ఓరి! నీరూపము కాల! మిత్రుఁడా!
బ్రహ్మసృష్టిలో నెన్నెన్ని చిత్రము లున్నవి!

కుశ—గాలవా! కవిబ్రహ్మసృష్టిలో నింతకుమించిన విచిత్రములు లేవా?

కుశు—గీ॥ బ్రహ్మసృష్టి ప్రపంచచి • త్రములు చిరము
నిలుచునవి కావు, కాల మ • న్నిటి హరించు;
ఇంతవర కెన్నిగలిగెనో, • యెన్ని మనెను,
యెన్ని నశియించిపోయెనో • యెవని కెఱుక?

లవు—గీ॥ కవికి నొక్కనికే వీని • గాథ యెఱుక
ప్రళయమందిన సర్వప్ర • పంచములను
భావసంజీవిచే నిట్టు • బ్రతుకఁ జేసి
యక్షరాకారములఁ ద్రోడ • నతఁడు సమపు॥

కుశు—గీ॥ కవి వీక్షింపలేని లో • కంబు లేదు
దూర మిది, దాపిది, యటన్న • మేర లేదు
సుగమ మిది, దుర్గమ మిదన్న • చోటు లేదు
భువనచయమెల్ల నతనిచూ • పున నె మెలఁగు.

లవు—గీ॥ భూతపూర్వంబుల, నభూత • పూర్వములుగ
నెలిపి, యెప్పటికప్పు డా • క్షణమునందు
జరుగుచున్నవిగా నె వి • శ్వంబు లెల్లఁ
గలము పోటున నాడింపఁ • గలఁడు సుకవి

కుశు—గీ॥ లోకములు కావ్యరంగంబు • లోని తెరలు
వానిలోఁ జన్నవా రున్న • వారు గలిసి
యాడుదురు, పాడుదురు, తగ • వాడుకొందు,
రిట్టి నవ్వుదు, రేడ్తు రే • మేమొ గతుల.

లవు—మిత్రులారా! ఇట్టివికదా కవిబ్రహ్మసృష్టిలోని విచిత్రములు. వాగ్బ్రహ్మమునఁ బ్రబుద్ధులైన వాల్మీకిభగవానుల రామాయణేతిహాసప్రపంచమున మన మిప్పుడు సంచరించుచున్నాము. ఆయాపాత్రల యవస్థాభేదముల ననుభవించుచున్నాము. ఆమహానుభావుని యనుగ్రహముచేఁగదా రామాయణవిషయములన్నియు మనకుఁ బ్రత్యక్షానుభవములోనికి వచ్చుచున్నవి, చూడుఁడు,

సీ॥ కనులారఁ జూచుటే ♦ కాదు రాముని పెండ్లి
మించుటోగిర మారగించినాము
గురుభక్తి రాముపై ♦ గుదురుటే కాదు పే
రడవిఁ దోడై వెంట ♦ నడచినాము
పాపాసరస్సార ♦ భము లాటుటే కాదు
హృదయంబు గిరఁగి పో ♦ ట్టడ్చినాము
కపులతోఁ జెలిమిపై ♦ కలసియాడుటె కాదు
రాల్గాంచి సేతు వే ♦ ర్పఱచినాము
గీ॥ కడలి లంఘించి, లంకలో ♦ నడచినాము
రక్కసులఁగాంచినాము పో ♦ రాడినాము
రణమునకువచ్చి నేఁడెల్లి ♦ రావణుండు
నవ్వఁగలమింక వాని యం ♦ తమును గాంచి.

వటుప్ర—మిత్రమా ! నేఁటి రేపట వానికథ తుదముట్టును. మనయాశ్రమమున కెవరో పెద్దలు దయచేసినారఁట అందువలన రేపు మనకు శిష్టానధ్యయనదినమని గురువు లాదేశించినారు.

గాల—అట్లయిన వానిచావున కింకను రెండుదినము లభ్యంతర మున్నది. ఈలోపున వాఁడు నాకంటఁబడకున్న బాగుండును. మిత్రులారా! నన్ను మాయింటిదాఁకఁ బంపి పొండు; త్రోవలో వాఁడు నాకెదురైనచోఁ గక్కురుమందును.

లవు—పోదమురమ్ము మేము నీకడనుండఁగా నీకేమిభయము ?

కుశు—తమ్ముఁడా! నీవుకూడ నెందులకు? నే నితనిఁ బంపివత్తును. ఇంతలో నుపాధ్యాయు లేపనికైనఁ బిలుతురేమో నీవుపొమ్ము.

(కొందఱువటువులతోఁ గుశుఁడు నిష్క్రమించును.)

లవు—మనము రామకీర్తనఁబాడుకొనుచుఁ బోదము.

(వెనుకటిపాట పాడుచుండఁగా)

(జనకుఁడు, కంచుకి, యరుంధతి, కౌసల్య ప్రవేశించుచున్నారు)

జన—ఓహో! నేఁడు శిష్టానధ్యయనము కాఁబోలు. అందువలన వటువు లందఱు యథేచ్ఛగా నాడుకొనుచున్నారు.

కౌస-బాల్యమేకదా సౌఖ్యమున కాస్పదము. (నిరూపించి) ఆహా!
వీరినడుమనున్న యీబాలుఁ డెవ్వఁడో, ఉదారముగ్ధలలితములైన యవయవములతో మాారామభద్రుని పసితనంపు లీలలఁ దలపించుచు నాకన్నులఁ జల్ల జేయుచున్నాఁడు.

అరు-(తనలో) ఇదియేకదా వాల్మీకి చెప్పినరహస్యకర్ణామృతము. కాని యీయాయుష్మంతులగు కుశలవులలో సీతఁ డెవ్వఁడో ?

జన-ఆహా! ఎవ్వఁడీబాలకుఁడు !

సీ॥ కలువఱేకులకాంతిఁ • జిలుకు నున్నదనంపు
మెఱుఁగుఁజామనచాయ • మేనివాఁడు
అలిసిలపు నిగన్ని • గల పిల్లసిగతోడ
ముద్దారు చిన్నారి • మోమువాఁడు
చలువవెన్నెలల జా • బిలివోలె వటువులలోఁ
బున్నెంపుసిరి సించు • చిన్నవాఁడు
చిఱుతప్రాయంబునందె • మరల నారఘురాముఁ
డని నిరూపింప వీ • లైనవాఁడు
గీ॥ బాలకుం డీతఁ డెవ్వరి • వాఁడొ కాని
కూర్మిసుత సీతమోము గ • న్గొనెడు భాగ్య
మునకు వాచిన నానేత్ర • ములకుఁ గూడ
హాయిమన నించె నిట్టె సు • ధాంజనంబు.

కంచు-ఈబాలకుఁడు క్షత్రియ బ్రహ్మచారియని నానమ్మకము.

జన-సందేహ మెందులకు?

సీ॥ పేఁపునం దిరువంక • వెలయుఁ గోర్ముడి దాఁకు
కంకపత్రికదంబ • కము లదొనలు
ఉరమునం దొప్పారు • రురుచర్మ చేలంబు
భసితపుంజపరాగ • పావనంబు
కటిసీమఁ జెన్నారుఁ • గావిమాంజిష్టంబు
లలితమౌర్వీమేఖ • లాయుతంబు

కరసరోరుహమందు • మెఱుఁగారుఁ గార్ముక
ప్లక్షదండము, లక్ష • వలయకంబు
గీ॥ అర్హచిహ్నంబు లివియెల్ల • నట్టులుండ
ధీర లలితప్రసన్నగం • భీరమైన
యట్టిమూర్తి పొక్కటే చాల • దా యితండు
క్షత్రియబ్రహ్మచారి ని • క్కమని తెలుప ?

ఆర్యా గృష్టీ! నాకుఁ గడు వేడుక యగుచున్నది. నీవుపోయి వాల్మీకిభగవానుల నడిగిరమ్ము. చూడు, ఆబాలకునితో ఈవృద్ధులెవ్వరో నిన్నుఁ జూడఁ గోరుచున్నారనియుఁ జెప్పుము

కంచు—చిత్తము. ఆలాగే చేసెదను. (నిష్క్రమించును.)

కౌస—ఇట్లు చెప్పిన వచ్చునా ?

అరుం—ఇటువంటి యాకారవిశేషమునకు మంచినడవడి లేకుండునా ?

కౌస—అహా! గృష్టి వాక్యములు కడునశంకువతో నాలించి, వెంటనే తోడిబాలుర నెల్ల విడిచి యాతఁ డీటు మొగంబై రానేవచ్చుచున్నాఁడు.

లవు—(ప్రవేశించి తనలో) వీరందఱు పూజ్యులే, అయినను వీరినామక్రమగోత్రంబు లెఱుంగకయే యెట్లు నమస్కరింపనగును ? (ఆలోచించి) కాని, ఈపద్ధతియు విరుద్ధముకాదని పెద్దలవలన విన్నాఁడను. (వినయముతో సమీపించి) ఈలవుఁడు మీకందఱకు సాష్టాంగప్రణామ మాచరించుచున్నాఁడు.

అరుంధతి— } కల్యాణిన్ ఆయుష్మాన్ భూయాః !
జనక— }

కౌస—బిడ్డా! చిరకాలము వర్ధిల్లుము !

అరుం—ఇటురా నాయనా ! (అని లవునితొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని తనలో) ఆహా! ఒడిమాత్రమే కాదు ; చిరకాలమునకు నామనోరథముగూడ నిండినది.

కౌస—బిడ్డా! ఇటుగూడఁ గొంచెమురమ్ము. (ఒడిలోఁ జేర్చికొని) అహా! నవనీలోత్పలమువలె శ్యామలోజ్జ్వలమైన దేహబంధముచేత నేగాక

కమలకేసరగ్రాసముచే మధురకంఠమగు రాయంచయెలుంగువలె ఖంగనమ్రోయు గంభీరస్వరముచేతఁగూడ వీఁడు రామభద్రునినోటిలోనుండి యూడిపడినట్లున్నాఁడు. తామరకోశమువలెఁ బరిపేశలమైన తనుస్పర్శముగూడ నట్లేయున్నది. నాయనా! ఏది నీముఖచంద్రు నొక్కమాఱుచూడనిమ్ము (అని చుబుకము నెత్తిచూచి కన్నీటితోఁ సాభిప్రాయముగా) రాజర్షీ! కనిపెట్టితివా? చక్కఁగఁ బరికించినచో నీని ముద్దుమోమునందు విస్పష్టముగ, గోడలిమోము చందురుని జాడలును జూపట్టుటలేదా?

జన--చూచుచున్నాను సఖీ! చూచుచున్నాను.

కౌస--అయ్యో! పిచ్చియెత్తినదానివలె నామనస్సేమేమో తలపోఁతలతోఁ బలుపోకలఁబోవుచున్నదే.

జన--ఆహా! ఇంకను సందేహమెందులకు?

మ॥ ప్రతిభానంబు సమగ్రముట్టిపడుచుం ♦ డన్ జానకీరాఘవుల్
ప్రతిబింబించిరొ వీనిలోపల; సుహా ♦ వశ్రీలవే, వాకదే,
గతి నాకోవినయంబులా యవె, నిస ♦ ర్గప్రాభవంబే నదే
మతి యేమో యడియాసలన్ బుఱుపఱుం ♦ బర్వెత్తు హా దైవమా!

కౌస--అబ్బాయీ! నీకుఁ దల్లియున్నదా? నీతండ్రిం దలంచుకొనుచుందువా?

లవు--లేదు.

కౌస--అట్లైన నీ వెవ్వరివాఁడవు?

లవు--వాల్మీకిభగవానునివాఁడను.

కౌస--ఓయీ! అడిగినది విస్పష్టముగఁ జెప్పుము.

లవు--నాకింతవరకే యెఱుక.

(తెరలోపల) ఓహోహో సైనికులారా! ఇదిగో కుమారచంద్రకేతుఁడాజ్ఞాపించుచున్నాఁడు. "ఎవ్వఁడును ఆశ్రమప్రాంతప్రదేశముల నాక్రమింపఁగూడదు" అని.

అరుం--ఓహో! యాగాశ్వరక్షాప్రసక్తిచే నిచ్చటికివచ్చు కుమారుఁ జంద్రకేతునిగూడఁ జూడఁగలము. ఆహా ఇదేసుదినము.

కౌస--ఆహా! వత్సలక్ష్మణుని పుత్రకుఁ డాజ్ఞాపించుచున్నాఁడను నమృత బిందుసుందరములగు నక్షరములు వినఁబడుచున్నవి.

లవు--ఆర్యా! ఈచంద్రకేతుఁడెవరు ?

జన--దశరథకుమారుల రామలక్ష్మణుల నెఱుంగుదువా ?

లవు--ఎఱుంగ కేమి? రామాయణకథాపురుషులు వారేకదా!

జన--అవును. ఆలాగైన నిది యేలయెఱుఁగవు? ఆలక్ష్మణునికుమారుఁడే యీచంద్రకేతువు.

లవు--అట్లయిన నూర్మిలాదేవికిఁ బుత్రుఁడు... రాజర్షియగు మిథిలానాథునికి దౌహిత్రుఁడు.

అరుం--(నవ్వుచు) కుమారుఁడు కథాపాండిత్యమును బ్రకటించినాఁడు.

జన--బాలకా! ఆకథయందు నీకింతటిపాండిత్య మున్నదికదా ఏదీ ఆ దశరథకుమారుల కేయేభార్యలయం దేయేపేరుల యపత్యములు పుట్టిరో చెప్పుము చూతము.

లవు--ఈకథాభాగము మేముగాని యన్యులుగానియెన్నఁడు విన్నదికాదు.

జన--అదియేమి! కవి రచియింపనే లేదా?

లవు--రచియించినారు. కాని ప్రకటింప లేదు. దానిలోని యొకకథా భాగమును రసవత్తరమగు నాటకముగాఁ గూడ రచించిరి. ఆ గ్రంథమును స్వహస్తముతోఁ లిఖించి తౌర్యత్రికసూత్రధారియగు భరతాచార్యులకుఁబంపినారు.

జన--ఎందులకు?

లవు--ఆమహానుభావుఁ డప్సరస్త్రీలచే దాని నాడించునని,

జన--ఇదియంతయు నేదో గూఢార్థముగనున్నది.

లవు--ఆగ్రంథముపై వాల్మీకిభగవానుల కెంతయో యభిమానము. అందుకొఱకే యంతేవాసులచే దానిని భరతాశ్రమమునకుఁ బంపునపుడు త్రోవలో నేప్రమాదముగలుగకుండఁ ధనుర్ధరుని నాసహాయుఁ దగునిఁగూడఁ బాసటగాఁ బంపియుండిరి.

కౌస--నీకుసహోదరుఁడుగూడఁ గలఁడా?

లవు--ఆఁ కలఁడు. కుశుఁ డని ఆర్యుని పేరు
కౌస--అనఁగా నీకు జ్యేష్ఠుఁడన్నమాట.
లవు--అవును, ప్రసవానుక్రమంబున నాతఁడే పెద్దవాఁడు.
జన--ఎట్లూ! ఆయుష్మంతులు మీరు కవలపిల్లలా యేమి?
లవు--అవును.
జన--బాలకా! చెప్పుము ప్రకటితమగు కథాప్రపంచ మెంతవరకు వచ్చినది?
లవు--పౌరజానపదుల మిథ్యాపవాదమునకు వెఱచిన రాజుచే వెడలఁగొట్టఁబడిన ఆసన్నప్రసవవేదనయగు సీతామహాదేవిని లక్ష్మణుఁడేకాకినిగాఁ గీకారణ్యమున విడిచి
కౌస--అయ్యో బిడ్డా! ఏకాకినివై యల్లాడు నిశరీర పుష్పమున కేదైవ దుర్విపాకము సంభవించెనో కదా!
జన--హా వత్సా! సీతా!, ఏమైపోయితివి
మ॥ అనిమిత్తంబగునిందచే నడవిపా • లై,సాయముం జేయ నా
యనువా రెవ్వరు లేక, కాన్పుసమయం • బై, నొప్పులం దూలుచో
మును వెన్కన్ సహనోగ్రజంతునివహం • బుల్ మూఁగి కాఱాడ 'నో
జనకా! నాగతిఁజూడవే' యనుచు వ • త్సా! యెంత వాపోయితో.
లవు--(అరుంధతింగూర్చి) అమ్మా! వీరెవరు?
అరుం-- ఈమె కౌసల్య; ఈయన జనకుఁడు.
లవు--(బహుమానఖేదకౌతుకములతోఁ జూచును)
జన--ఔరా! దురాత్ములగు నీపౌరుల నేమనవలయు? ఈరామరాజు వేగిరపాటున కేమనవలయు!
మ॥ పరిభావంబిది ఘోరవజ్రహతియై • బాధింపఁ గ్రోధాగ్నికిన్
దరుణంబైనది చాపశాపముల చే • తన్ భగ్నునన్ మండఁగా ... ...
కౌస--భగవతీ! రక్షింపుము రక్షింపుము, కుపితుఁడైన యీరాజర్షిని బ్రసన్నుం జేయుము.
అరుం--అవును పరాభూతులైన మానవంతుల కింతకంటెఁ బ్రాయశ్చిత్తము లేదు, కాని రాజర్షీ!

అరయఁగ రాముఁడు నీకుఁ బుత్రవిషయంబౌ పౌరసంతాన మా
దరణీయద్విజబాలవృద్ధవికలస్త్రీణాంబికఁ గన్పేఁపనా॥

వటువులు—(సంభ్రమమునఁ బ్రవేశించి) కుమారా! "అశ్వము అశ్వము" అని యొకానొక భూతవిశేషము జనపదములయందుండునని వింటిమే దానిమేమిప్పుడు ప్రత్యక్షముగాఁ జూచినాము.

లవు—అశ్వమని, పశుశాస్త్రమందే కాక సాంగ్రామికశాస్త్రమునఁ గూడఁ జదివితిమి. ఇఁక దానిస్వరూపమెట్లున్నదో చెప్పుఁడు

౧ వటుఁడు—చెప్పనా? దానికి వెనుకభాగమున నొక జల్లితోఁక యున్నది

౨ ,, కుమారా అది దానినెల్లప్పుడాడించుచుండును.

౩ ,, మెడ చాల నిడుపుగానున్నది.

౪ ,, మనయాశ్రమకురంగములకెట్లో దానికిని గిట్టలు నాలుగే.

౧ ,, అదియు గరికెపరకలే మేయును.

౨ ,, కాని యది మామిడికాయలంతపాటి శకృత్పిండకముల వేయును

౩ ,, కుమారా! ఈవ్యాఖ్యానములతో నదియీపాటికిఁ జాలదూరము పోయియుండును రమ్మురమ్ము పోదము (అని భరోత్తరీయముంబట్టిలాగుచున్నాఁడు.)

లవు—(కౌతుకోపరోధవినయములతో) పూజ్యులారా, చూడుఁడు చూడుఁడు, వీరునన్నులాగికొనిపోవుచున్నారు. ;(అనివడిగఁబరిక్రమించును.)

కౌస—భగవతీ! వీనిం జూడకున్న నే బ్రతుకునట్లులేదు. ఆవైపున కేగి పరువెత్తుచున్న కుఱ్ఱవానిం జూతము రండు.

అరుం—ఎట్లు చూడఁగలము అప్పుడే వాఁడు వేసుకన్నై కడుదూరము బరువెత్తినాఁడు.

గృష్టి—(ప్రవేశించి) వాల్మీకిభగవానులు సెలవిచ్చినారు "ఈవిషయము తగు సమయమున మీకే తెలియఁగలదు" అని.

